LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 27 | 7.7.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

### విజయవాడ సత్యాగ్రహ విజయంతో

## కాంగ్రెస్‌లో ఆనందం - 'దేశం'లో విషాదం

విజయవాడలో జరిపిన సత్యాగ్రహం విజయవంతం కావడం - కాంగ్రెస్‌వాదులకు సంతోషం, తెలుగుదేశానికి ఖేదం కల్గిస్తోంది. జడివానలో, నడిరోడ్డు మీద బురదలో కూర్చొని, సాయంత్రం 4గంటలకు కార్యక్రమం పూర్తయ్యిందని ప్రకటించే వరకు జనం కదలక పోవడం ఈ సత్యాగ్రహం విశేషం. ఇటీవల కాలంలో రాజకీయ పార్టీలు చేపట్టిన కార్యక్రమాలకు ఇంత మాత్రం జనం స్పందించడం అరుదైన విషయం. అది కాంగ్రెస్ పార్టీ పట్ల అభిమానంతో జరిగింది కాదు; విద్యుత్ ఛార్జీల పెంపకం పట్ల కడుపుమంటతో తరలి వచ్చిన జనం వారు.

ఉద్యమం ఉధృతమైతే చంద్రబాబు ధరలు తగ్గిస్తాడేమోనన్న ఆశ ప్రజలలో కొత్తలక్ష్మై - కాంగ్రెస్ పిలుపు ఇచ్చినా, వామపక్షాలు పిలిచినా పౌరులు తమంతట తామేంగా వీధుల్లోకి వస్తున్నారు. విజయవాడలోనే కొందరు స్థానికులు, పార్టీలతో ప్రమేయం లేకుండా సాయంత్రం ఒక గంట పాటు తమ వీధుల్లోని ఇళ్లన్నిటిలో దీపాలు ఆర్పేసి నిరసన ప్రకటించారు. రాయలసీమ, తెలంగాణాలలోని చాలా గ్రామాలలో కరెంట్ బిల్లులు కట్టకుండా సహాయ నిరాకరణ ప్రారంభమైంది. గ్రామస్తులందరూ ఉమ్మడిగా నిర్ణయించుకొని, బిల్లుల వసూలు కోసం వచ్చిన లైన్ మెన్‌లను, బిల్‌కలెక్టర్లను వెనక్కు త్రిప్పి పంపుతున్నారు. నెల్లూరు జిల్లాలోనూ - నాయుడుపేట దగ్గర అన్నమేడు గ్రామస్తులు సహాయ నిరాకరణ పాటిస్తున్నారు. అయితే

### జడివానలోనూ కదలకుండా కూర్చొన్న ప్రజలు

చంద్రబాబు ఇష్టం ప్రకారం మాత్రమే నడుచుకొంటున్న దినపత్రికలు ఈ సంఘటనలకు ప్రచారం రాకుండా జాగ్రత్త పడుతున్నాయి. ఒక గ్రామంలో బిల్లుల చెల్లింపు నిరాకరణ జరిగిందని ప్రచారం వస్తే తతిమా గ్రామాల వారు దాని నుంచి స్ఫూర్తి పొందుతారనే భయంతో ఈ వార్తలను కప్పి పెడుతున్నారు.

అయితే రోజురోజుకీ ప్రజలలో ఛార్జీల పెంపకం పట్ల వ్యతిరేకత వ్యక్తమైతున్నది తప్ప, సమసి పోవడం లేదు. పైపెచ్చు బిల్లుల చెల్లింపుకు గడువుదాటితే రూపాయికి రూపాయి వరకు పెనాల్టీ చెల్లించాల్సి వస్తుందని ప్రభుత్వం తాజాగా ప్రచారం ప్రారంభించడంతో పుండు మీద కారం చల్లినట్లయ్యింది. ఛార్జీల విషయంలో ప్రభుత్వ నిర్ణయానికి వ్యతిరేకంగా ప్రారంభమౌతున్న చర్చ సబ్సిడీ బియ్యం ధర పెంపకం, బలహీన వర్గాల ఇళ్ల నిర్మాణం నిలిపివేత, అభివృద్ధి పనులు ఎక్కడివక్కడ ఆగిపోవడం, ఆస్పత్రులలో నిరుపేదలూ ఫీజులు చెల్లించవలసి రావడం వంటి నిర్ణయాలూ ప్రజా సంక్షేమ వ్యతిరేకమేనన్న అభిప్రాయానికి దారితీస్తున్నాయి. ఇటీవలి వరకు చంద్రబాబు రాష్ట్రం మేలు కోసమే నిర్ణయాలు తీసుకొంటున్నాడని సమర్థిస్తుండిన వారూ - ఇన్ని బరువులు మోపి చేసిన మేలేమి వుంది అని ప్రశ్నించు కొంటున్నారు. గ్రామ చావడులలో జరిగే పిచ్చాపాటి సంభాషణలలో ఈ మాటలు, ప్రస్తావనలు తరచు విన్పిస్తున్నాయి.

తెలుగుదేశం కార్యకర్తలు, ఎమ్మెల్యేలకు ఈ మార్పు అర్థమౌతున్నది; కాని చంద్రబాబు మాత్రం మొండిగా వున్నాడు. ఛార్జీలు తగ్గించే

కొనసాగింపు ఆరవ పేజీలో

## తీపిగుర్తుల సిరి శ్రీలక్ష్మి కలెక్టర్ గిరి

నెల్లూరు జిల్లా కలెక్టర్ వై. శ్రీలక్ష్మి బదలీ అయ్యారు. హైదరాబాదు చేనేత శాఖ డైరెక్టర్‌గా నియమించారామెను. కొత్త కలెక్టర్‌గా హైదరాబాద్ నుంచి ప్రవీణ్‌కుమార్ నియమితులైనారు.

కలెక్టర్‌గా శ్రీలక్ష్మి నెల్లూరు పౌరులకు చాలాకాలం గుర్తుండిపోతారు. ఆమె పని చేసింది రెండున్నర సంవత్సరాల లోపే అయినా రెండు దశాబ్దాలపాటైనా జ్ఞాపకం మిగిలే రీతిలో వ్యవహరించారామె. గతంలో గూడూరు సబ్ కలెక్టర్‌గా పనిచేసినప్పుడు ఆమె పేరు చెప్తేనే టెర్రర్; కలెక్టర్‌గా ఆ పదను, పవరు కన్పించలేదన్నది నిజం. అనుభవంతో వచ్చిన పరిణతి అందుకు కారణమై వుండవచ్చు. అట్లని రాజకీయవాదులతో సర్దుబాటు వైఖరి మాత్రం అవలంబించలేదు. తనకు సరిపడకుంటే ఎంతటి వారినైనా దులపరించి పారేయడం ఆమె లక్షణం. గత క్యాబినెట్‌లో మంత్రిగా వుండిన సోమిరెడ్డి చంద్రమోహనరెడ్డి పట్ల ఆమె అనుసరించిన వైఖరే అందుకు నిదర్శనం. అడ్డదిడ్డపు పనులు చెప్తే చేయడం తన వల్ల కాదని కుండబద్దలు కొట్టినట్లు ముఖానే చెప్పి, పైలు విసిరిపారేసి, గెస్టుహౌస్ నుంచి వెలికి వచ్చేశారామె ఒకసారి! అప్పటి నుంచి, ఈ బదలీ వరకు వారి మధ్య ఉప్పులో నిప్పే! ఆత్మకూరు ఎమ్మెల్యేగా వున్నప్పుడు కొమ్మి లక్ష్మయ్యనాయుడు పనులు చేయకుండా, మంజూర్లు లేకుండా జన్మభూమి పథకం క్రింద 80లక్షల రూపాయల బిల్లులు డ్రా చేయడానికి ప్రయత్నించినప్పుడు ఆమె ఎంతగా ప్రతిఘటించిందీ అందరికీ తెలిసిన విషయమే. అది మనసులో పెట్టుకొని జిప సమావేశాలలో ఆమె పట్ల తెలుగు ఎమ్మెల్యేలు అనుచిత వైఖరి అవలంబించినా, ముఖ్యమంత్రి స్థాయి నుంచి వత్తిడి తెచ్చినా ఏ మాత్రం లొంగక

కొనసాగింపు ఆరవ పేజీలో

## పోలీస్ దండకాల్లో వాటాలపై మల్లగుల్లాలు!

నెల్లూరు టౌన్ పోలీసుల మధ్య వాటాల పంపకంలో రేగిన చిన్న వివాదం చిలికి చిలికి గాలివానగా మారింది. ఆ రగడలో ఎవరెవరి దండకాలెంతో, పంపకాలెంతో పబ్లిక్ అయిపోతున్నాయి. ఆ వివరాలు వింటుంటే - దొంగలు దొంగలు వూళ్లు పంచుకోవడం అన్న సామెత ఎందుకు పుట్టిందోనన్న ధర్మ సందేహం ఎవరికైనా వుంటే - ఇట్టే తీరిపోతుంది.

మొత్తం రభసకు పుట్టిక స్థానం - త్రీటౌన్ పోలీస్ స్టేషన్. గత పది, పన్నెండేళ్ల నుంచి నెల్లూరును సందర్శించే ఐజీలు, డిఐజీల వంటి ఉన్నతాధికార్లకు, వారి భార్యా పిల్లలకు తిరుగు ప్రయాణానికి రైలు టిక్కెట్లు కొని, ఉచితంగా ఇచ్చే డ్యూటీ త్రీ టౌన్ ఎస్ఐలు బుద్ధిగా నిర్వహిస్తుండినారట. సరాసరిన రోజుకొక ఏసి కోచ్ టికెట్ కొనాల్సి వచ్చేదట వీరికి. ఈ స్టేషన్‌కు కొత్తగా వచ్చిన ఎఎస్ఐ రాంబాబు అందుకు ససేమిరా అంగీకరించినట్లు లేదు. ఐజీని, డిఐజి కాని - డబ్బు ఇస్తే టిక్కెట్ తెప్పిస్తాను తప్ప, లంచాలు తిని, పంపకం మాత్రం చేయనని నిర్మొహమాటంగా చెప్పడంతో సమస్య మొదలైంది. దానితో ఈ ఖర్చు భరించమని ఫోర్త్ టౌన్ ఎస్ఐని ఆదేశించారట ఒక పోలీసు అధికారి. ఆయనకు కోపం కస్సున వచ్చింది. నేరుగా సిఐ గారి గదిలోకి వెళ్లి తన అక్కసంతా వెళ్లగక్కారట. ఆ వివాదంలో కొందరు కానిస్టేబుళ్లు సైతం మాట కలిపినట్లున్నారు. ఇప్పటికే తనకు గెస్టుహౌసలలో బస చేసే పై అధికార్లకు మందు, విందు సమకూర్చే బరువు పెట్టారని, రైలు టిక్కెట్ల ఖర్చు కూడా భరించమంటే తనవల్లకాదని ; క్యారియర్ పట్టుకొని ప్రతిరోజూ మురళీకృష్ణ మయూరి వంటి హోటళ్ల ముందు అడుక్కుతినేవాడి మాదిరి నిలబడవలసి రావడం తనకు తల తీసేసినట్లుగా వుందని ఫోర్త్ టౌన్ ఎస్ఐ లబోదిబో మనడం అక్కడ చేరిన జనానికి జాలి కల్గించింది. తన స్టేషన్ రాబడిలో టౌన్‌బస్ మామూళ్లు కీలకమైనవని, అయితే ట్రాఫిక్ ఎస్ఐలు, సిఐలు తన నోరుకొట్టి టౌన్‌బస్సుల నుంచి వారే దండుకొంటున్నారని వాపోయారాయన. ఆదాయమే లేక అల్లాడి పోతుంటే, అదనపు ఖర్చు నా వల్ల కాదు పొమ్మన్నాడు.

### నాలుగు స్టేషన్ల మధ్య నలుగుతున్న వివాదం

అక్కడితో ఆ విలాపం ఆగివుంటే బాగుండేది. ఎంత సేపటికీ ఎస్ఐల మీదపడి గిల్లుతారే తప్ప, మీకు వచ్చే రాబడిలోనుంచి ఎందుకు కొంత ఇవ్వకూడదు అని సిఐని ఎదురు ప్రశ్నించడంతో ఇద్దరి మధ్య పెద్ద ఘర్షణ జరిగిందట. స్టేషన్‌కు వచ్చిన జనం, లోపలున్న కానిస్టేబుళ్ల ఎదురే వీరు తమ తమ జాతకాలు చెప్పుకోవడం వినేవారికి ఎబ్బెట్టుగా వుండింది.

ఈ స్టేషన్ మామూళ్లు, ఎస్ఐ డ్యూటీల కథాకమామిషు భలే సరదాగా వుంది. ఒక్కొక్క స్టేషన్‌కు ఒక్కొక్క డ్యూటీ స్పష్టంగా నిర్ణయమై వుంది పాపం. వన్ టౌన్ ఎస్ఐ విధి - అందరు పోలీసు అధికార్లకు చేపలు, మాంసం, కూరగాయలు, సరఫరా చేయడమట. ఆయనకు ఇన్‌కం సోర్సు - బంగారు అంగళ్లు, మార్కెట్ వ్యాపారులు. టూ టౌన్ ఎస్ఐ వలసరకులు, కాస్మోటిక్స్, బియ్యం ప్రతి ఇంటికి సరిపడా అందించాలట. ఇది కాక ఖర్చులకు డిఎస్పి, ఎస్పి, ఎఎస్పిల వంటి వారి స్థాయిల కనుగుణంగా నెలనెలా నిర్ణీత మొత్తం జీతం వలె ఇవ్వడమూ అతడి డ్యూటీయే. టౌనంతటిలోకి అత్యధిక రాబడి కల్గిన స్టేషన్‌గా టూ టౌన్‌కు పేరుందట. వైశ్యుల మధ్య వచ్చే వ్యాపార తగాదాలు; ఇళ్లు, అంగళ్లు ఖాళీ చేయించడం వంటివాటిలో ఈ స్టేషన్‌కు రాబడి వచ్చిందట.

నెక్స్టు బెస్ట్ స్టేషన్ - త్రీ టౌన్. రైల్వే దొంగలు, దొంగ బంగారు వ్యాపారం వంటి కేసులతో పాటు బ్రాంది షాపుల సంఖ్య సైతం ఎక్కువట ఈ స్టేషన్ పరిధిలో! అందువల్ల ఈ ఎస్ఐ రైలు టిక్కెట్లు, బాడుగ కార్లు సరఫరా చేస్తుంటారు. హైదరాబాదుకు ఒక్క ఏసి టిక్కెట్ ఖరీదు దాదాపు వెయ్యి రూపాయలు. రోజా ట్యాక్సీ బాడుగ ఐదు వందలు. ఈ లెక్కన ఈ ఎస్ఐ నెల తిరిగేసరికి ఎంత బరువు మోయాలో చూడండి.

ఫోర్త్ టౌన్ ఎస్ఐ డ్యూటీ - ముందే చెప్పినట్లు క్యారియర్లు, విస్కీ సీసాల సరఫరా. ఆయనకు టౌన్‌బస్సులు అధికం; బ్రాంది పాపులు, కూరగాయల మార్కెట్ మామూళ్లు అదనం. అయితే ఈ మధ్య మద్రాసు బస్టాండు మార్కెట్ బయట, రోడ్డుపై బుట్టలు పెట్టుకొని అమ్ముకొనే చిల్లర వ్యాపారుల నుంచి రోజు వారీ మామూళ్ల దందరంలో ఆయనకు, ట్రాఫిక్ సిఐ గారికి పేచీ వచ్చింది. టౌన్ సిఐ మధ్యస్థం పని చేయలేదు. దానితో మార్కెట్ నాగేశ్వరావు రంగ ప్రవేశం చేసి, ఇద్దరు అధికార్లను పోలీసు స్టేషన్‌లోనే కూర్చోబెట్టి "గట్టిగా మందలించి", రాజీ కుదిర్చాడట.

ఫిఫ్త్ టౌన్ ఎస్ఐ - పోలీసు భవనాలకు అవసరమైన ఇటుక, సిమెంట్ సమకూర్చాలన్నది నియమం. ఆయన ఏరియాలో ఇళ్ల స్థలాల గొడవలు, వాటికి మధ్యస్తాలు ఎక్కువ; అదే రాబడికి మార్గం.

సిఐ గారికి ఇన్‌కం సోర్స్ కేవలం వ్యాపార పంచాయతీలు మాత్రమే. ఆయన కార్యాలయం సమావేశమందిరం వలె వుంది. రోజూ అర్ధరాత్రి దాటినంత వరకు అక్కడ ఏదో ఒక మధ్యస్తం జరుగుతూనే వుంటుంది. కేసులు పెట్టుకోవడం, కోర్టుల చుట్టు తిరగడం శ్రమ అనుకున్నవారు ఇక్కడ కలిసి, కూర్చొని, మాట్లాడుకొని సర్దుకు పోతుంటారు. కొన్ని లక్షల రూపాయల వ్యాపార లావాదేవీలు, ఆస్తి పంపకాలు సాగుతుంటాయిక్కడ.

ఎస్ఐ స్థాయి రాబడి, ఖర్చులు; సిఐ

కొనసాగింపు ఆరవ పేజీలో



# దానం చేయడమే నేరమా?

పైన కన్పించే బొమ్మ - పాఠశాల భవనం; ఎక్కడో మారుమూల గ్రామంలోనిది కాదిది; నెల్లూరు పప్పుల వీధిలోని మునిసిపల్ హైస్కూలు. పై కప్పు పెంకులు లేచిపోయి, గోడలు పెచ్చులూడి, లాదుకుపాడిన చెక్క పూడిపోయి రేపోమాపో కూలడానికి సిద్ధంగా వున్న ఈ పాడుబడ్డ భవంతిలో పదకొండు వందల మంది పిల్లలు చదువు నేర్చుకొంటున్నారు. ప్రభుత్వ పాఠశాలలు ఇటువంటి దయనీయ స్థితిలో వుండడం చాలా మామూలు సంగతి; మనసుకు కష్టం కల్గించే విషయం - దీన్ని పునర్నిర్మించడానికి ఒక దాత పదిలక్షలు విరాళం ఇచ్చినా దాని తలరాత మారకపోవడం!

చాలా పురాతనమైన స్కూలు ఇది; ఆర్ఎస్ఆర్ బిపిఎస్ స్కూళ్ల ముందు నుంచే వుండేది. అందువల్ల స్టోన్‌హౌస్‌పేట, రెట్టిగుంటరోడ్డు, లక్ష్మీపురం ప్రాంతాలలోని అధికశాతం పౌరులు ఇక్కడ చదివిన వారే. లయన్స్ క్లబ్ మాజీ గవర్నర్, హోటల్ శివం ముందుకు వచ్చారు. ఆయన్ను ఎవరూ కోరలేదు; తనకు తానే మునిసిపల్ ఆఫీసుకు వెళ్లి 6 లక్షల రూపాయల చెక్కు ఇచ్చి, గమ్మున కారెక్కి తిరిగి వచ్చేశాడు. ఒక ఫోటో లేదు, ఒక పత్రికా ప్రకటన లేదు, ఒక ప్రచారం లేదు. భవనానికి తన పేరు పెట్టమని అడగలేదు, కట్టుడు కాంట్రాక్టు ఇమ్మని కోరలేదు.

అంత నిస్వార్థంగా, నిశ్శబ్దంగా, కుడిచేతితో ఇచ్చేది ఎడమచేతికి తెలియకుండా దానమిచ్చే దాతలు ఇప్పుడెవరున్నారు? ఇటువంటి సత్రకాలం పెద్దమనిషి ఇంకా మిగిలి వున్నందుకు మునిసిపల్ నేతలు, అధికారులు ఎగిరి గంతేసి, ఆయన్ను ప్రోత్సహించి వుండాలి. కాని జరిగింది అందుకు విరుద్ధం! సురేష్ తమ్ము చేతికి

### పప్పులవీధి పాఠశాల కథ వింటే కడుపు రగులుకపోతుంది!

కట్టి మొత్తం సొమ్ము స్వాహా చేసేశారు. ఇప్పుడు దస్త్రమా ఖర్చయిపోయింది; విరాళంగా వచ్చి ఆరు, దానికి మ్యాచింగ్ గ్రాంట్ మరొక ఆరు - మొత్తం పన్నెండు లక్షలు కౌన్సిలరు, ఆమె పతిదేవుడు, అధికార్లు కలసి దిగమ్రింగేశారు. కాని స్కూలుకు కొత్త భవనం ఏర్పడే సంగతి దేముడెరుగు - ఉన్నది కాస్తా పూడింది. కాంట్రాక్టరు కట్టిన ఐదు గదులకు తలుపులు లేవు, కిటికీలు లేవు, కరెంట్ లేదు, మరుగుదొడ్లు లేవు, మంచినీళ్లు లేవు, ఆఖరకు నేలపై ఫ్లోరింగ్‌కూడా చేయలేదు. ద్వారబంధం సైతం పెట్టని భవనానికి బిల్లులు చెల్లించిన మునిసిపల్ ఇంజనీర్లను ఏ ఉప్పుపాతర వేయాలో, వేదినూనెలో ఉడికించాలో నిర్ణయించుకోవడం రేపు ఆ యమదేవుడికైనా సాధ్యమా అన్నది సందేహం.

ఈ స్కూలులో పిల్లల సంఖ్య 1050; ఐదు గదుల్లో అంత మందిని కుక్కడం అలవిమాలిన పని కావడంతో అయ్యవార్లు ఆరుబయలున బడి నడుపుతున్నారు. పాత



తలుపులు, కిటికీలు, నేలమీద గచ్చు లేకుండా నిర్మించిన ఈ సుందర భవనానికి 10 లక్షల బిల్లు చెల్లించింది - మునిసిపాలిటీ

అధినేత, నెల్లూరు వైశ్య ప్రముఖులలో ఉత్తమోత్తమ సంస్కారి అని నిస్సందేహంగా చెప్పదగిన ఎర్రపల్లి సురేష్ - ఆ అభిమానంతోనే ఈ పాఠశాల భవన పునర్నిర్మాణానికి పది లక్షల రూపాయల విరాళం ఇవ్వడానికి అందగానే దాన్ని జన్మభూమి క్రింద చేర్చి పెండర్ లేకుండా ఒక కౌన్సిలర్ పతిదేముడికి కాంట్రాక్ట్ ఇచ్చేశారు. ఆయన సగం భవనం కూలగొట్టి ఆ రాళ్లు రప్పలు కూడా ఎత్తకుండా, మూడు మంత్రంగా ఐదు ఇరుకు గదులు భవంతిలోకి వెళ్లాలంటే - సగం కూలగొట్టింది కాబట్టి ఎప్పుడు మీదపడుతుందోనన్న భయం. వానవస్తే బడికి సెలవు. ఆరు బయటే కాదు - కొత్త గదుల లోపలా ఉరుసే; అంత

తరువాయి 11వ పేజీలో

# సణుగుడు

- పత్రికా విలేఖరులపై పోలీసు దౌర్జన్యాలు !
- కార్యకర్తలను వదిలితే ఉద్యమాలు నిలవవు !
- బంట్రోతు బిళ్ల రమేష్‌రెడ్డికి తగిలిస్తే పోలేదా ?

పోలీస్ బుద్ధి కుక్కతోకతో సమానం; దాని వంకరైనా సవరించవచ్చు కాని వీరిని సంస్కరించడం దుర్లభం. చట్టం తమ చేతికి లాఠీ ఇచ్చింది తమకు నచ్చినవాడిని బాదడానికేనన్న స్థిరాభిప్రాయం వీరిలో పాతుకపోయి వుంది. ఎన్ని లాకప్ డెత్‌లు, దానిపై ఇంకెన్ని ఆందోళనలు, కోర్టుల చివాట్లు, దర్యాప్తు కమీషన్ల నిర్ధారణలు జరిగినా మన పోలీసులలో మాత్రం అణువంత మార్పు రావడం లేదు. తతిమా పౌరుల కంటే తామధికులమన్న గర్వం, తామేమి చేసినా చెల్లుబాటై పోతుందన్న దురహంకారం, తమను ఇబ్బంది పెట్టేవారిని కొట్టి బెదిరించి, దౌర్జన్యం చేసి, లొంగదీసుకోగలమన్న దురభిప్రాయం పోలీసులను వదలడం లేదు. అవినీతి, లంచగొండితనం, అధికారనేతలకు బానిసత్వం, గూండాలతో స్నేహం, దొంగలతో నెయ్యం, తార్పుడు గాళ్లతో సహవాసం వంటి సకల అవలక్షణాలు కల్గిన హీనచరిత్రులు కూడా - తమ ఖాకీదుస్తులు వాటన్నిటినీ కప్పి పెడతాయని భ్రమ పడుతుంటారు. పాలకపార్టీ ఎమ్మెల్యేలు, వారి తాబేదార్ల ముందు తోకవూపుకొంటూ తిరిగే శునకాలే నయం అన్పించేట్లు నడిచే పోలీసులు - సాధారణ ప్రజల దగ్గరకు వచ్చేసరికి తెలుగు సినిమా విలన్‌ల వలె అవతారమెత్తుతుంటారు. ఈ మధ్య కాలంలో వీరి దుష్ప్రవర్తన సాధారణ పౌరులకు పరిమితం కావడం లేదు; న్యాయవాదులు, జర్నలిస్టులు వంటి వృత్తిపర వర్గాలకూ విస్తరిస్తున్నది.

మొన్నొక రోజు 'వార్త' దినపత్రిక విలేఖరిపై బుచ్చిరెడ్డిపాలెం కానిస్టేబిల్ ఒకడు నడివీధిలో సినిమా గూండా వలె దౌర్జన్యం చేశాడు; తరిమి, తరిమి కొట్టాడు. ఆ విలేఖరి వారం రోజుల పాటు ఆస్పత్రిలో చికిత్స పొందవలసి వచ్చింది. తనవద్దకు మొరపెట్టుకోవడానికి వచ్చిన జర్నలిస్ట్ సంఘం ప్రతినిధులను ఎస్పీగారు లాలించి, బుజ్జగించి పంపారే తప్ప, ఆ కానిస్టేబిల్‌పై ఏ మాత్రం చర్యలేదు. అరెస్ట్ చేసిన అర గంటలోపల బెయిల్ ఇచ్చేశారు; సాధారణంగా క్రిమినల్ కేసు పెట్టిన పోలీసుద్యోగులను అది పరిష్కారమయ్యే వరకు సస్పెండ్ చేయడం పరిపాటి; ఇక్కడ అదీ జరగలేదు.

బుచ్చి, సంగం, దగదర్తి ప్రాంతాలలో ఈనాడు, వార్త తదితర దినపత్రికల విలేఖరులు ఇటువంటి పోలీసు దౌర్జన్యాలు ఎదుర్కోవడం పరిపాటి అయిపోయింది.

తాజాగా సంగం ఎస్సై గారు అక్కడి జమీన్‌రైతు విలేఖరిపై తమ లాఠీ ప్రభావం ప్రదర్శింప చూస్తున్నారు. బస్టాండ్‌లో జనమందరి ఎదుట ఒక మహిళ పట్ల పోలీస్ కానిస్టేబిల్ ఒకడు అసభ్యంగా ప్రవర్తించిన వార్త ప్రచురించడం ఆ ఎస్సై దొరగారి ఆగ్రహానికి కారణమట. విలేఖరి ఇంటికి పోలీసులను పంపి, దౌర్జన్యంగా స్టేషన్‌కు లాక్కెళ్లడానికి ప్రయత్నించారు.

ఏమిటీ దుర్మార్గం? పోలీసులు తమ గురించి తామేమను కొంటున్నారు? పత్రికలో వార్తలు వ్రాసే వారిని స్టేషన్ లాకప్‌లో కుక్కినంత మాత్రాన, వీధిలో కొట్టినంత మాత్రాన తమ తప్పులు సమసిపోతాయను కొంటున్నారా? విలేఖరులు భయపడి వార్తలు వ్రాయడం మానుకొంటారను కుంటున్నారా?

పత్రికలకు, పత్రికా విలేఖరులకు

డోలేంద్ర

రాజ్యాంగం ప్రసాదించిన హక్కుల గురించి ఏ మాత్రం పరిజ్ఞానం వున్నా, పోలీసులు ఇంత దుడుకుగా ప్రవర్తించరు. ఎస్పీ వంటి శాఖాధికారులు వీరిని రక్షించ చూసినా న్యాయస్థానాలలో న్యాయం గిడ్డుపోలేదు. న్యాయం ఖరీదైనదని, విలేఖరులు దానిని భరించలేరని పోలీసులు భావిస్తున్నట్లుంది. కాని, సంఘటిత వృత్తి రంగాలలో ఏ ఒక్కరూ ఒంటరి కారు; ఖరీదు లెక్కలోకి రాదు.

నెల్లూరు జిల్లా పోలీసు యంత్రాంగం పత్రికా స్వేచ్ఛను అరికట్టడానికి దౌర్జన్యమార్గం అవలంభిస్తే - తీవ్ర పరిణామాలు ఎదుర్కోక తప్పదని, తమ తప్పులకు శిక్ష అనుభవించకుండా తప్పించుకోలేదని గ్రహించడం వారి వంటికే మంచిది. లంచాల మడుగులో, అక్రమాల బురదలో కూరుకపోయి వున్న పోలీసులు పత్రికలను ఎప్పటికీ బెదిరించలేరు; విలేఖరులను భయపెట్టనూ లేరు.

***

ఏసునాయుడు అనే నెల్లూరు కాంగ్రెస్ కార్యకర్తను పోలీసులు అరెస్ట్ చేసి, జైలుకు పంపారు. విద్యుత్ ఉద్యమంలో తొల జైలు పక్షి అతడే. ధర్నా సందర్భంగా విద్యుత్ ఎస్ఈ కార్యాలయంలో పేబుళ్లు విరగొట్టాడని నేరారోపణ; ఉద్యమాలలో కార్యకర్తలపై ఇటువంటి కేసులు సర్వసాధారణం. కాని ఇక్కడ విశేషం - ఆ రోజు సంఘటనలో ఎమ్మెల్యేలు, మాజీ ఎమ్మెల్యేలు, ఇతర నేతలు చాలా మంది

తరువాయి 8వ పేజీలో

# ప్రమాదకర ఫరూక్ కోరిక!

తమ రాష్ట్రానికి స్వయం ప్రతిపత్తి కల్పించాలని కాశ్మీర్ ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లా చేసిన విజ్ఞప్తి - జాతి విచ్ఛిన్నానికి ప్రయత్నం ప్రారంభించడం వంటిదే! సంకీర్ణంలోని సభ్యులను కష్టపెట్టకుండా కత్తిమీద సాము చేయ చూస్తున్న ప్రధానమంత్రి వాజ్‌పాయి బలహీనతను అవకాశంగా తీసుకొని ఫరూఖ్ ఈ కందిరీగల తుట్టెను కదిలించారు.

స్వాతంత్ర్యానికి పూర్వం కాశ్మీర్ ఒక స్వతంత్ర రాజ్యం. కరణ్‌సింగ్ పూర్వీకులు దానికి రాజులు. వారి దేశభక్తి ప్రపూరిత నిర్ణయంతో కాశ్మీర్ ఇండియాలో విలీనమైంది. అయితే అక్కడి ప్రత్యేక రాజకీయ పరిస్థితుల వల్ల 1953 వరకు కాశ్మీర్ భారతదేశంలో మరొక పిల్ల దేశంగా వ్యవహరించింది. ఫరూఖ్ తండ్రి షేక్ అబ్దుల్లా ఆ దేశానికి ప్రధానమంత్రి. ఆయన్ను "రాష్ట్రపతి" అని పిలిచేవారు. 1953లో జవహర్‌లాల్ నెహ్రూతో కుదిరిన ఒప్పందం ప్రకారం షేక్ అబ్దుల్లా కాశ్మీర్‌ను భారత్‌లోని తతిమా రాష్ట్రాల వలె కలిపేసి, తాను ముఖ్యమంత్రిగా వ్యవహరించారు. ఆ తర్వాత కొంత కాలానికి మళ్లీ వారిలో స్వాతంత్ర్య పిపాస రేగింది, పెద్ద ఎత్తున ఆందోళన చేశారు, షేక్ అబ్దుల్లా చాలా కాలం జైలు జీవితాన్ని గడిపారు. బంగ్లాదేశ్ యుద్ధం తర్వాత ఇందిరాగాంధీ అత్యంత బలవంతురాలైన నేతగా ఆవిర్భవించడంతో తమ పోరాటం వ్యర్థమని భావించి షేక్ అబ్దుల్లా 1974లో ఇందిరమ్మతో ఒప్పందం చేసుకున్నారు. రాజ్యాంగంలోని 370 ఆర్టికల్ ప్రకారం తమ రాష్ట్రానికి లభించే ప్రత్యేక అధికారాలు కొనసాగించడం వరకు మాత్రమే ఆ ఒప్పందం పరిమితమైంది. కాశ్మీర్ స్వయంప్రతిపత్తి సంక్షిప్త చరిత్ర ఇది!

ఇంత కాలం ఫరూఖ్ అబ్దుల్లా ఈ విషయం ప్రస్తావించలేదు. ఇప్పుడు కేంద్రంలో వాజ్‌పాయి ప్రభుత్వం తుమ్మితే వూడే ముక్కు వలె తయారవడం ఆయనకు ఒక అవకాశంగా కన్పించింది. దానితో ఏకంగా తమ అసెంబ్లీలో ఒక తీర్మానమే చేయించాడు. ఇందులో ఫరూఖ్ తప్పు పూర్తిగా వుందని చెప్పలేము; తామీ ప్రకారం అసెంబ్లీలో చర్చ జరపబోతున్నామని వాజ్‌పాయికి ముందుగానే తెలియజేశాడు ఫరూఖ్; అప్పుడే ప్రధాని ఆ ప్రతిపాదనను ఖండించి వుంటే బాగుండేది. కాని తనకు మద్దతు ఇచ్చే పార్టీ నేత మనసు నొప్పించలేక చర్చ వరకు జరుపుకొంటే ఇబ్బంది లేదని మెతకదనం వహించాడు. కాశ్మీర్‌కు ప్రత్యేక అధికారాలు కల్పించే రాజ్యాంగంలోని 370 ఆర్టికల్‌ను రద్దు చేయాలని బిజెపి కొన్ని దశాబ్దాలుగా కోరుతున్నది. ప్రత్యేకాధికారమే వద్దని కోరే పార్టీ నేత స్వయం ప్రతిపత్తిపై చర్చకు అనుమతి ఇవ్వడం ఎంత ఆత్మవంచన? అధికార దాహంలేని జాతీయ నేతగా ఇంత కాలం వాజ్‌పాయికి ప్రజల మన్నన వుండేది; ఇప్పుడు తన అధికారం కాపాడుకోవడానికి దేశ శ్రేయస్సుకు భంగం కల్గినా సహించే స్వార్థపరుడిగా మారిపోతున్నాడు.

స్వయంప్రతిపత్తి అంటే - భారతదేశానికి సామంతు రాజ్యంగా అవతరించడం. అది లభిస్తే - భారత రాజ్యాంగంతో కాశ్మీర్‌కు సంబంధం వుండదు. వారికి ప్రత్యేక ప్రధానమంత్రి, రాష్ట్రపతి ఏర్పడుతారు. సుప్రీంకోర్టు, ఎన్నికల కమీషన్, పార్లమెంట్ చట్టాలు వారికి వర్తించవు. రక్షణ, కరెన్సీ, విదేశీ వ్యవహారాలకు మాత్రమే భారత దేశంపై వారు ఆధారపడతారు. దాదాపుగా దేశం నుంచి విడిపోవడంతో సమానం అది.

భారత రాజకీయాలలో అరవై సంవత్సరాల సంపర్కం కల్గిన ఇది ఎంతటి విచ్ఛిన్న ధోరణులకు దారితీస్తుందో తెలియదని భావించలేము; ఫరూఖ్ అసెంబ్లీలో తీర్మానం చేయగానే పంజాబ్ ముఖ్యమంత్రి ప్రకాశ్‌సింగ్ బాదల్, అస్సాం ముఖ్యమంత్రి ప్రఫుల్లకుమార్ మహంత తమ తమ రాష్ట్రాలకూ స్వయంప్రతిపత్తి కావాల్సిందేనని ప్రకటించడంతో పాటు - తమ అసెంబ్లీలలో తీర్మానం చేయించడానికి ప్రయత్నిస్తున్నారు. తమిళనాడులో -వైగో జరిపిన తమిళ జాగృతి సదస్సు స్వయం నిర్ణయాధికారం కోరికను ప్రతి ధ్వనింపజేసింది. ఆంధ్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కొంచెం మృదుస్వరంతో రాష్ట్రాలకు ప్రత్యేకాధికారాలు కావాలని కోరారు. నాగా లాండ్, మిజోరాం, మేఘాలయ, త్రిపుర వంటి ఈశాన్య రాష్ట్రాలలో ఎప్పటి నుంచో జరుగుతున్న వేర్పాటు ఉద్యమాలకు ఫరూఖ్ కోరిక నైతిక మద్దతు కల్పించినట్లయ్యింది.

ఒక్కసారిగా దేశంలో జాతి విచ్ఛిత్తి ఉద్యమం ప్రారంభమయ్యే దుర్మార్గ సంఘటనకు నాంది పల్కాడు ఫరూఖ్ అబ్దుల్లా. దేశవినాశన ప్రయత్నానికి అసెంబ్లీ తీర్మానం ద్వారా రాజకీయ గౌరవం సంతరించిపెట్టాడు. యాభైఏళ్ల స్వతంత్ర భారత చరిత్రలో ఇంతటి ప్రమాదకర పరిణామం ఎన్నడూ జరగలేదు. పంజాబ్‌లో భింద్రన్‌వాలే, కాశ్మీర్‌లో పాకిస్తాన్ కిరాయి మూకలు, ఈశాన్య రాష్ట్రాలలో బోడో, మిజో, త్రిపుర ఉపజాతి సమితి వంటి తీవ్రవాద సంస్థలు చాలా ఏళ్ల క్రితమే వేర్పాటు కోరికలు విన్పించినా - ఆ ఉద్యమాలకు టెర్రరిస్ట్, మిలిటెంట్ కార్యకలాపాలుగా తప్ప, రాజకీయ గౌరవం ఏర్పడలేదు. టెర్రరిస్టులను సైన్యంతో అణచి వేయడానికి ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి.

కాని ఇప్పుడు ఫరూఖ్ అబ్దుల్లా, ప్రకాశ్‌సింగ్ బాదల్, వైగో, చంద్రబాబు, మహంతా తదితరులు కేంద్ర ప్రభుత్వంలో భాగస్వాములు; కేంద్ర మంత్రిత్వాలు, రాష్ట్ర ముఖ్యమంత్రిత్వాలు నెరపుతున్నారు. ఈ అన్ని కీలక రాష్ట్రాలలో వీరి పాలనే సాగుతున్నది. వీరందరికీ అసెంబ్లీలలో మెజారిటీ వుంది; పార్లమెంట్‌లో ఎమ్పీలున్నారు. వీరు ఏమి మాట్లాడినా దానికి ప్రజామోదం వున్న భ్రమ కల్గుతుంది. కేంద్ర ప్రభుత్వంపై వత్తిడి ఏర్పడుతుంది. లక్షమంది టెర్రరిస్టులు దేశానికి చేయలేని అపకారం సంకుచిత పరుడైన ఒక్క ముఖ్యమంత్రి చేయగలడు. ఇంత తెలిసీ వాజ్‌పాయి - ఫరూఖ్‌ను ప్రోత్సహించడం దేశద్రోహం. ఆర్ఎస్ఎస్, విహెచ్‌పి వంటి సంస్థలు, బిజెపి అధ్యక్షుడు కుశభావ్ ఠాక్రే ఈ ప్రతిపాదనను గట్టిగా ప్రతిఘటించడంతో పాటు, బహిరంగంగా విమర్శించినందువల్లనే చివరి నిమిషంలో భయపడి, క్యాబినెట్ ద్వారా కాశ్మీర్ అసెంబ్లీ తీర్మానాన్ని తిరస్కరించాడు వాజ్‌పాయి. ఆయన మరింత మొగమాటపడి ఈ తీర్మానాన్ని పెండింగ్‌లో పెట్టివుండినా; లేక రాజ్యాంగ కమీషన్ వంటివాటికి నివేదించి వుండినా ఎంతో అనర్థం జరిగి వుండేది. దేశ విచ్ఛిన్నకర వాదులు పదే పదే ఆ సమస్యను ప్రస్తావించే అవకాశం కల్గేది.

జరిగిన ఈ అనర్థాన్ని ఇప్పుడు సరిదిద్దే బాధ్యత సైతం వాజ్‌పాయిదే; తన ప్రభుత్వ భాగస్వామ్య పార్టీలేవీ వేర్పాటువాద ఉద్యమాలు, తీర్మానాలు, ప్రకటనలు చేయకుండా నిరోధించాలి. ప్రజలలో ఈ చర్చ కొనసాగితే రాష్ట్రాల మధ్య అవిశ్వాసం, అభద్రతా భావాలు తలెత్తుతాయి. భారత దేశం కూడా రష్యా వలె ఛిద్రమై పోతుంది.

---

## జమీన్‌రైతు

7.7.50

వెల: 0-2-0 పేజీలు: 12

### నెల్లూరు ముచ్చట్లు అధికార వర్గం

కొత్త కలెక్టర్ జోగప్పగారు చురుకుగా కనిపిస్తున్నారు. ఉద్యోగ కార్యకలాపములను ఒక క్రమపద్ధతిలో జరుపడమేగాక, చెప్పినవి సావధానంగా వినడం, తొందరపడి అవసరమైన పనులలో వెంటనే చర్యగైకొనడం జరుగుచున్నది. పత్రికా విలేఖరుల సమావేశం జరిపి, నెల్లూరు జిల్లాలో జరిగిన, జరుగుతున్న ప్రభుత్వ కృషిని సమీక్ష చేయడం, జిల్లాలోని పరిస్థితులను వారి ద్వారా వినడం ప్రజా ప్రభుత్వానికి అనుగుణంగా వుంది. కమ్యూనిస్టుల విషయంలో కూడా, మొన్న కర్నాలు గ్రామంపై దాడి జరిగిన వెంటనే, మన జిల్లాకు గూడా అలాటి ప్రమాదమేదైనా సంభవించగలదేమోనని, అప్పటికప్పుడే తగు రక్షణ జాగ్రత్తలకు కలెక్టరు పుత్తర్విచ్చాడని విని సంతోషిస్తున్నాం. జిల్లా నాగపడాలన్నా, కాంగ్రెస్ ప్రభుత్వ పనితనరు యినుమడించాలన్నా యిలాంటి అధికారులు అవసరం. ప్రజలు వీరితో సహకరిస్తే రెండింతలుగా పని చేయగలరు.

### బస్ ప్రమాదం

యు.బి.ఎస్. వారి నెల్లూరు, కావలి బస్ 30తేది నాయుడుపేటకు 2మైళ్లలో బోల్తా కొట్టింది. తీవ్రంగా గాయపడి నాయుడుపేట హాస్పటల్లో చేర్చబడ్డ కె.రామకృష్ణారెడ్డి చనిపోయ్యాడు. డ్రైవరు

**50 ఏళ్లక్రితం ఈ వారం**

అహిరుకు ఎడమ కాలు విరిగింది. అతనిని మద్రాస్ జనరల్ హాస్పిటల్‌లో చేర్చారు. మరి 15 మంది గూడా గాయపడ్డారు. ఈ ప్రమాదానికి కారణం అధిక వేగంతో పోతూ, అడ్డువచ్చిన ఒక ముసలామెను తప్పించు కోబోగా పడిపోయిందని తెలుస్తున్నది.

### ఆత్మకూరు ఎన్నికలు

ఆత్మకూరు పంచాయతీ బోర్డుకు ఏనాడూలేని పోటీ ఈనాడు వచ్చింది.

తరువాయి 10వ పేజీలో

---

## జనవాణి

# కొత్త వ్యవసాయ విధానం జన వినాశనానికే!

రాష్ట్ర ప్రభుత్వ విధానాలు నానాటికి దిగజారిపోతున్నాయి. రాష్ట్రంలో కొత్త వ్యవసాయ విధానం అమలులోనికి తెచ్చి వాణిజ్య పంటలను పండిస్తారట. ఇవి రాష్ట్రాన్ని ఆకలి చావుల కేంద్రంగా మార్చేందుకు ప్రపంచ బ్యాంకు సారథ్యంలో రూపుదిద్దుకొంటున్న అందమైన కుట్ర తప్ప మరొకటి కాదు. వాణిజ్య పంటలు పండిస్తే ఆహార పంటల దిగుమతి తగ్గిపోయి, వీటి కోసం ఎవరిపైనో ఆధారపడవలసి వస్తుంది. నూతన వ్యవసాయ విధానం ముసుగులో ప్రపంచ బ్యాంకు డాక్యుమెంటును రైతుల మీద రుద్దడానికి జరుగుతున్న ప్రయత్నాలను రైతులు ఉద్యమించి అడ్డుకోవాలి.

నెల్లూరు కె. వెంకయ్య

### దేశం ముక్కలవుతుంది

స్వయంప్రతిపత్తి కావాలంటూ కాశ్మీర్ అసెంబ్లీ చేసిన తీర్మానం విపరీత పరిణామాలకు దారితీస్తుంది. కాశ్మీర్ దారిలోనే పంజాబు, అస్సాం, తమిళనాడు చివరికి చంద్రబాబు కూడా ఎక్కువ అధికారాలు కావాలంటూ కేంద్రాన్ని అడుగుతున్నారు. ఇదే నిజమైతే భారతదేశం, ఆఫ్రికా ఖండం ఏవిధంగా ముక్కలైందో, అదే విధంగా ముక్కలవుతుంది. దేశవిభజన ఖాయం. కాశ్మీర్ తీర్మానాన్ని పార్లమెంట్ తిరస్కరించాలి. కాశ్మీర్ ముఖ్యమంత్రి ఫరూక్ అబ్దుల్లా తీర్మానం వెనుక పెద్ద కుట్ర వున్నట్లుంది.

నెల్లూరు జె.పోలిరెడ్డి

### పాలకులు ప్రజానిరసనను పట్టించుకోవాలి

టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేసేవారి వల్ల రైల్వే శాఖకు భారీ నష్టాలొస్తే, దాన్ని పూడ్చుకోవడానికి టిక్కెట్టుకొని ప్రయాణం చేసేవారి మీద ఛార్జీలు పెంచి భారం వేయడం ఘోరం. టిక్కెట్టులేని ప్రయాణికుల్ని శిక్షించే సత్తాలేని శాఖకు, టిక్కెట్టుకొని ప్రయాణించే వారిని హెచ్చించిన ఛార్జీలతో బాధించడం బాగుందా? తప్పౌకరిదైతే - దండన మరొకరికా? చౌర్యం అరికట్టే దమ్ములేక, బకాయిలు దండే చావలేక సరఫరా, పంపిణీల్లో అయ్యే వృధానరికట్టే సామర్థ్యం లేక విద్యుత్ శాఖకు భారీగా నష్టాలొస్తుంటే - వ్యవసాయ, గృహవిద్యుత్ వినియోగదార్లపై ఛార్జీలు విపరీతంగా పెంచి విరుచుక పడటం ఏం న్యాయం? ఆకలివేస్తే కేకలు వేసే బిడ్డను కూడా కమ్యూనిస్టుగా ముద్రవేసే విధానాన్ని పాలకులు మానుకోవాలి. మోయలేని భారం మీద పడ్డప్పుడు బాధతో నిరసన తెల్పడం అతిసహజమైన విషయం. ఇది రాజకీయం కానేకాదు. ప్రజల మద్దతుతో కాంగ్రెస్, కమ్యూనిస్ట్ పార్టీలు రాష్ట్ర వ్యాప్తంగా బంద్‌లు, హర్తాళ్లు, రాస్తారోకోలు నిర్వహిస్తున్నారు. పాలకులు ప్రజానిరసనను పూర్తిగా పట్టించుకోకపోతే పరిస్థితులు సాదువుతాయి. విమర్శల్లోని వాస్తవాలను సహృదయంతో స్వీకరించే సద్బుద్ధి వుండకపోతే అది

తరువాయి 10వ పేజీలో

# బ్రాందీషాపులే బార్లు-ఎక్సైజ్ కక్కుర్తికి దార్లు

నెల్లూరు టౌన్ పలు ముఖ్య కూడళ్లలోని బ్రాందీ షాపుల యజమానులు నియమ నిబంధనలకు పాతరేసి అనధికారికంగా బార్లు నిర్వహిస్తూ, రెండు చేతులా సంపాదిస్తున్నారు. త్రీ స్టార్ హోటళ్లు మాత్రమే బార్ నడుపుకోవ డానికి అర్హులన్నది నిబంధన; లంచాలను దిగమింగుతున్న ఎక్సైజ్, పోలీస్ అధికారులు దాన్ని తుంగలో తొక్కేశారు. దీంతో నడిరోడ్డు పైనే తాగి తుళ్లుతూ కవించేవారు, మహిళలను వేధించేవారు, జులాయిలు ఎక్కువైపోయారు. టౌన్‌లోని అర్చనా హాలు ఎదురుగా వుండే బ్రాందీ షాపు వారు మిద్దెపై ఎత్తుగా గోడలు లేపి, టేబుళ్లు వేసి బారును నడుపుతున్నారు. క్రింద వున్న పాస్ట్‌ఫుడ్ సెంటర్ నుంచి నాన్‌వెజ్ ఐటమ్స్ కూడా ఇక్కడకు సరఫరా చేస్తారు. నర్తకిహాలు ప్రక్కనున్న నిర్మల రెస్టారెంట్ బ్రాందీ షాపుకు అనుబంధంగా పాత రెస్టారెంట్ వుండే చోటే బార్ నడుస్తుంది. ఇక్కడ కూడా మద్యపాన ప్రియులకు కావాల్సిన ఐటమ్స్ లభిస్తాయి.

## నెల్లూరు వీధుల్లో తాగుబోతుల వీరంగం

అమరావతి హోటల్ వద్ద వున్న బ్రాందీ షాపు వారు ప్రక్కనే వున్న మరుత మంచాల లాడ్జిని ఎత్తేసి ఇక్కడ బారును నడుపుతున్నారు. మద్రాస్ బస్టాండ్ సెంటర్‌లో మిగతా సెంటర్లకు మించి నాలుగు బార్లు నిత్యం రద్దీతో నడుస్తుండడం విశేషం. నెహ్రూ బొమ్మ ఎదురుగా వున్న గాడ్ వైన్స్ నిర్వాహకులు వెనుక వున్న ఖాళీ స్థలంలో తమిళనాడులో మాదిరి చలువ పందిర్లు వేసి బార్ నడుపుతున్నారు. వాహబ్‌పేట వెళ్లే దారిలో వున్న సూర్య వైన్స్ పెట్రోల్ బంకు వెనుక వైపు స్థలంలో బారును నిర్వహిస్తున్నారు. ఈ బస్టాండ్‌లోని షాపింగ్ కాంప్లెక్స్‌లోని కామాక్షి వైన్స్ 24 గంటల పాటు బారును నిర్వహిస్తున్నారు. ఏ సమయంలో వెళ్లినా ఇక్కడ మద్యం దొరుకుతుందని ప్రతీతి. స్టేట్‌బ్యాంక్ మెయిన్ బ్రాంచి ప్రక్కనున్న బ్రాందీ షాపులవాళ్లు వెనుకవున్న హైర్స్ షాపును బార్‌గా మార్చేశారు. రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలకు వెళ్లే నాగుల మిట్టరోడ్డులో వైన్‌షాపును నడుపుతున్న వ్యక్తి

తొరువ 11వ పేజీలో

# నేర పరిశోధనలో శాస్త్రీయ విధానాలు

నేర పరిశోధనలో శాస్త్రీయ పద్ధతులను ప్రవేశపెట్టేందుకు రాష్ట్రంలో పోలీసు వ్యవస్థను ఆధునీకరించేందుకు వివిధ ప్రణాళికలు రచించినట్లు డిజిపి హెచ్.జె.దొర చెప్పారు. 6తేది నెల్లూరు మూలపేట పోలీస్ క్వార్టర్స్ వద్ద 15లక్షలు వెచ్చించి పోలీసులు నిర్మించిన షాపింగ్ కాంప్లెక్స్, కె.యస్. వ్యాన్ స్కూల్‌లో నిర్మించిన అదనపు భవనాలను ప్రారంభించి డిజిపి విలేఖరులతో మాట్లాడారు. నేరాలు జరిగిన వెంటనే నేరస్తులను పట్టుకొనేందుకు వీలుగా వుండేందుకు రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో స్పెషల్ డాగ్స్క్వాడ్‌లు, ఫోరెన్సిక్ ల్యాబ్‌లు ఏర్పాటు చేస్తున్నాం. ఒక్కొక్క ల్యాబ్ కోసం 50లక్షల రూపాయలు ఖర్చవుతుంది. ఇక్కడ వేలి ముద్రల నిపుణులను కూడా నియమిస్తామన్నారు. రాష్ట్రంలో పోలీసులకు అత్యాధునిక శిక్షణ ఇచ్చేందుకు పోలీస్ శిక్షణలో పేరుగాంచిన

## డిజిపి దొర

ఇంగ్లాండుకు ఆరు మంది పోలీస్ అధికారులతో కూడిన టీమ్‌ను పంపాం. అక్కడ నుంచి కొంత మంది అధికారులను రప్పించి ఇక్కడ పోలీసు అధికారులకు శిక్షణ ఇస్తామన్నారు. 5కోట్ల రూపాయలతో రాష్ట్రంలో నేరస్తుల వేలిముద్రలన్నీ కంప్యూటరీకరించినట్లు డిజిపి చెప్పారు. ఇటీవల రాష్ట్రంలో జరిగిన బాంబు పేలుళ్ల విషయమై కారకులను ఇంకా గుర్తించలేదని వివరించారు. గతకొన్ని రోజులుగా రాష్ట్రంలో ఐఎస్ఐ సంస్థ కార్యకలాపాలు ఎక్కువైనా, బాంబు పేలుళ్ల వ్యవహారంలో వారి ప్రమేయం వుందని ఇంకా ధ్రువీకరించలేదన్నారు. గుంటూరులోని మసీదులో బాంబు పేలుళ్ల వెనుక దాగున్న వ్యక్తుల విషయమై మాట్లాడేందుకు డిజిపి నిరాకరించారు. రాష్ట్రంలో

తొరువ 11వ పేజీలో

# ఎమ్మార్వో కోసం ఎమ్మెల్యే పడిగాపులు

నెల్లూరు ఎమ్మార్వోను ఆయన ఆఫీసులో చూడాలన్న కోరికను సాక్షాత్తు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి వ్యక్తం చేశారు. తాను సృష్టించుకొన్న ప్రజాపథంలో భాగంగా ఎమ్మెల్యే నెల్లూరు ఎమ్మార్వో కార్యాలయానికి ఎప్పుడు వెళ్లినా ఆయన అందుబాటులో లేరట. సమస్యల విషయమై జవాబు చెప్పేవారు లేకపోవడంతో విసిగి పోయానని ఎమ్మెల్యే చెబుతున్నారు. 3తేదీ ప్రజాపథం కార్యక్రమంలో ఎమ్మార్వో కార్యాలయం వద్దకు వెళ్లిన ఎమ్మెల్యేకు, ఎమ్మార్వో పెంచల రెడ్డి అదృష్టవశాత్తు దర్శనమిచ్చారు. దీంతో ఎమ్మెల్యే ఆయనపై ప్రశ్నల వర్షం కురిపించారు. 'అయ్యా' నేను పలుమార్లు మిమ్మల్ని చూడాలని కార్యాలయానికి వచ్చినా మీరు కనపడలేదు. ఇలాగైతే ఏలానన్నారు. గతంలో ఇచ్చిన ఫిర్యాదులపై మంజూర్లు కోరగా ఎమ్మార్వో వాటిని ఇంకా పరిశీలించలేదని చెప్పాడట.

## సామాన్యులకేది దారి?

ఎమ్మెల్యేలు చెప్పిన చిన్న చిన్న ప్రజా సమస్యలే నాలుగైదు నెలలు గడిచినా పూర్తి చేయకుంటే ఇక సామాన్యుల పరిస్థితి ఏమిటన్నారు. వారం రోజుల లోపల గతంలో తాను కోరిన ప్రజా సమస్యలు పరిష్కరించకుంటే ఊరుకోనని వివేకా తన సహజధోరణిలో చెప్పి అక్కడ నుంచి వచ్చేశారు. ఎమ్మార్వోకు వున్న రకరకాల పనుల వల్ల నెల్లూరు ఎమ్మార్వో ప్రజలకు అందుబాటులో వుండడం లేదు. దీంతో స్కూల్ పిల్లలు సర్టిఫికెట్ల కోసం పడుతున్న బాధ వర్ణించనలవికాని విధంగా వుంది. ఈ సమస్యకు పరిష్కారం చూసేవారెవ్వరో?

## స్టోన్‌హౌస్‌పేట రోడ్డు అధ్వాన్నం

నెల్లూరు టౌన్‌కు వాణిజ్య కేంద్రమైన

తొరువ 11వ పేజీలో



నెల్లూరు లయన్స్‌క్లబ్ అధ్యక్షునిగా బాధ్యతలు స్వీకరిస్తున్న ఇన్నమూరి ఉదయభాస్కరరావును అభినందిస్తున్న మాజీ అధ్యక్షుడు పి. ఆనందకృష్ణ

# సమగ్ర సోమశిలే ధ్యేయం!

సమగ్ర సోమశిల, కండలేరు ప్రాజెక్టుల కోసం అఖిలపక్ష రైతు పోరాట కమిటీ నేతృత్వంలో సిపిఐ దీర్ఘకాలిక ఉద్యమంలో పాల్గొంటుందని ఆ పార్టీ జిల్లా నూతన కార్యదర్శి పమజాల దశరథరామయ్య చెప్పారు. 1తేదీ ఆ పార్టీ కార్యాలయంలో విలేఖరులతో మాట్లాడుతూ సోమశిల ప్రాజెక్టులో 78 టిఎంసిలు, కండలేరులో 68 టిఎంసిల నీటిని నిల్వ వుంచుకొనేలా నిర్మించారు. కాని భూసేకరణ చేయక పోవడం వల్ల వృధాగా సముద్రానికి నీళ్లు పోతున్నాయి. మునక గ్రామాలకు 35కోట్లు రాష్ట్ర ప్రభుత్వం ఇస్తే, కేంద్రం 70కోట్లు ఇస్తుంది. దీని వల్ల 13లక్షల ఎకరాలకు సాగునీరు, 30లక్షల మందికి త్రాగునీరు లభిస్తుంది. జిల్లాలో శాశ్వతంగా కరవు నివారింపబడుతుందన్నారు. ఈ విషయమై ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నేతకు లక్ష మంది రైతులు పోస్టుకార్డులు వ్రాసి తమ బాధను తెలియజేస్తామన్నారు. రాష్ట్ర ముఖ్యమంత్రి జిల్లాకు చేసిన వాగ్దానాలన్నీ బూటకాలయ్యాయి. కృష్ణపట్నం థర్మల్ స్టేషన్ పనులు ఇంత వరకు మొదలవ్వలేదు. ఇఫ్కో ఫ్యాక్టరీ ఏమయ్యిందో తెలియదు. కె.పి. కెనాల్‌లో సన్నె ఛానల్లు ఎప్పుడు త్రవ్వుతారో తెలియని అయోమయ స్థితి నెలకొందన్నారు. విద్యుత్ ఛార్జీలను ఊపిరాడకుండా పెంచి, నిరసన

## అఖిల పక్షం తీర్మానం

తెలిపిన ప్రజలను పోలీస్ లారీలతో అణచాలని తెలుగుదేశం ప్రభుత్వం ప్రయత్నిస్తుంది. ఆ పార్టీ నాయకులు జిల్లాలో బ్రాందీ షాపులు నడుపుకొంటూ సుభిక్షంగా వున్నారని దశరథరామయ్య విమర్శించారు.

# గ్రామప్రాంతాల్లో వైద్య శిబిరాలు

నెల్లూరు లయన్స్ క్లబ్ నేతృత్వంలో గ్రామీణ ప్రాంతాల్లో వైద్య శిబిరాలు నిర్వహించేందుకు ఎక్కువ ప్రాముఖ్యత నిస్తానని క్లబ్ కొత్త అధ్యక్షుడు ఇన్నమూరి ఉదయభాస్కర్‌రావు చెప్పారు. క్లబ్ నూతన అధ్యక్షునిగా 2తేదీ బాధ్యతలు స్వీకరించిన అనంతరం మాట్లాడుతూ లయన్స్ క్లబ్ పేరు ప్రఖ్యాతులు మరింత పెంచేందుకు శక్తివంచన లేకుండా కృషి చేస్తానన్నారు. క్లబ్ సెక్రటరీగా ఎవిఆర్ మోహన్‌రావు, కోశాధికారిగా ఎన్.పి. ప్రసాద్ చేత క్లబ్ మల్టిపుల్ కౌన్సిల్ సెక్రటరి బెనర్జీ ప్రమాణ స్వీకారాలు చేయించారు. నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి, లయన్ డిస్ట్రిక్ట్ మాజీ గవర్నర్ యడవల్లి సురేష్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## షిర్డీసాయి ఫౌండేషన్ ఉచిత వైద్య శిబిరం

గతంలో ఎన్నో ఉచిత వైద్య శిబిరాలు విజయవంతంగా నిర్వహించిన ఘనత సాధించిన షిర్డీ సాయి రూరల్ వెల్ఫేర్ అండ్ మెడికల్ ఫౌండేషన్ మళ్లీ 9తేదీ ఇటువంటి శిబిరాన్ని నిర్వహిస్తుంది. విఆర్ లా కాలేజి ఆవరణలో జరిగే ఈ శిబిరంలో కంటి శుక్లాలు, స్త్రీల గర్భకోశ వ్యాధులు, చిన్న పిల్లల గుండె జబ్బులు, షుగర్ వ్యాధిగ్రస్తులను నిష్ణాతులైన డాక్టర్లు పరీక్షిస్తారని ఫౌండేషన్ కార్యదర్శి డాక్టర్ శ్రీధర్‌రెడ్డి చెప్పారు. శిబిరంలో కోయంబత్తూరులోని నేత్ర వైద్యుడు డాక్టర్ జగదీష్ కుమార్‌రెడ్డి కంటి వ్యాధిగ్రస్తులను పరీక్షించి అవసరమైన వారికి ఐఓఎల్ ఆపరేషన్లు టౌన్‌లోని అమెరికన్ ఆసుపత్రిలో చేస్తారు. స్త్రీల గర్భాశయాల్లో క్యాన్సర్ వ్యాధి ఎక్కువవుతున్నందున ఈసారి పాప్స్మియర్ పరీక్షలు నిర్వహించనున్నట్లు చెప్పారు. విజయా హార్ట్ ఫౌండేషన్‌లోని నిపుణులు డాక్టర్ విజయకుమార్, డాక్టర్

## నెల్లూరు సంగతులు

జనార్దనరెడ్డి, కంచికామకోటి చైల్డ్స్ ట్రస్ట్ హాస్పిటల్ డాక్టర్ కెవి. మురళీధరన్ చిన్నపిల్లల్లో గుండె వ్యాధులను గుర్తిస్తారు. అవసరమైన వారికి షిర్డీసాయి ట్రస్ట్ ఆపరేషన్లు చేయిస్తుంది. చిన్న పిల్లల డాక్టర్లు కె. మల్లిఖార్జునరెడ్డి, జడ్. శివప్రసాద్ పిల్లల్లో సాధారణ వ్యాధులను పరీక్షిస్తారు. షుగర్ వ్యాధి నిపుణులు సి. మల్లిఖార్జున్, వి. సురేష్‌రెడ్డి చక్కెర వ్యాధిగ్రస్తులను చూస్తారు. ట్రస్ట్ ఇంత వరకు 50 మంది పిల్లలకు గుండె ఆపరేషన్లు, 200 మందికి ఐఓఎల్ ఆపరేషన్లు చేయించినట్లు ట్రస్ట్ అధ్యక్షుడు డాక్టర్ సుందరరామిరెడ్డి చెప్పారు. ఉచిత వైద్య శిబిరాన్ని ప్రజలు ఉపయోగించుకోవాలని ట్రస్ట్ సభ్యులైన డాక్టర్లు మల్లిఖార్జునరెడ్డి

తొరువ 11వ పేజీలో

# నెల్లూరు వాడవాడల్లో [illegible]

## కొత్త కలెక్టర్ రాక

కొత్త జిల్లా కలెక్టరు ప్రవీణ్‌కుమార్ 8తేది పదవీ బాధ్యతలు స్వీకరించనున్నట్లు తెలిసింది. ఆయన తండ్రి రిటైర్డ్ పోలీసు డిఐజి; పిల్లనిచ్చిన మామ రిటైర్డ్ చీఫ్ సెక్రటరీ, భార్య తెపోమావో ఐఎఎస్ స్థాయి వరకు వున్న అధికారిణి; ఇప్పుడామె ఆర్‌డిఓగా పనిచేస్తున్నారు. అధికార యంత్రాంగంతో మమేకం చెందిన కుటుంబ వాతావరణం ఆయనది. అందువల్ల కలెక్టర్‌గా రాణించడం పెద్ద కష్టం కాకపోవచ్చు. స్వభావ రీత్యా ముక్కోపి అని ఒక వార్త; తినబోతూ రుచి అడగడమెందుకు?

కొత్తకలెక్టర్‌కు మా హార్దిక స్వాగతం.

## విద్యుత్ సదస్సుల నిధులు గోల్మాల్

విద్యుత్ ఛార్జీల పెంపకం తర్వాత, కనెక్షన్ల క్రమబద్ధీకరణ పేరిట ప్రభుత్వం నిర్వహించతలపెట్టిన సదస్సులకు ప్రభుత్వం మంజూరు చేసిన నిధులు జిల్లాలో గోల్మాల్ అయినట్లు గగ్గోలుగా వుంది. జిల్లా కలెక్టర్ జవాబుదారీ తనంగా ఈ నిధులను రాష్ట్ర ప్రభుత్వం మంజూరు చేసింది. విషయం విచారించి, వచ్చేవారం వివరంగా చెప్తాం.

## బదలీ తర్వాత బదలీలు

జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి బదలీ ఉత్తర్వులందుకొన్నాక చేసిన కొన్ని బదలీలు వర్చసియాంశమయ్యాయి. కలెక్టరేట్‌లో ఎన్నికల బాధ్యతలు చూస్తుండిన శ్రీనివాసులును గ్రైన్ పర్చేజింగ్ అసిస్టెంట్‌గా నియమించారామె. జిపిఎ అంటే రెవిన్యూ విభాగంలో కామధేనువు వంటి ఉద్యోగం; తనకు విశ్వాసపాత్రుడుగా పని చేసినందుకు పారితోషికంగా ఈ పోస్టింగ్ ఇచ్చినట్లున్నారు. కాని కలెక్టర్ స్థాయిలో, తాను బదలీ అయినట్లు ధృవపడిన తర్వాత ఉద్యోగులను తాను బదలీ చేయడం మంచి సాంప్రదాయం కాదు. ఆ తప్పు సరిదిద్దుకొంటే ఆమెకే గౌరవం.

కోవూరు నియోజక వర్గానికి సంబంధించిన కొన్ని అభివృద్ధి పనులకు కలెక్టర్ గారు వర్క్ ఆర్డర్లు జారీ చేసినట్లు చెబుతున్నారు. అదీ తప్పుడు పని క్రిందే లెక్క. నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి శ్రీలక్ష్మితో తనకు గల సాన్నిహిత్యాన్ని ఇప్పటికే చాలా దుర్వినియోగం చేశాడు. వెళ్లబోయే ముందూ ఆమె చేత తప్పు చెయించాడు. ఎవరికి ప్రతిష్ట చేకూరదు దీని వల్ల!

## పోస్టల్ కుంభకోణంలో బిజెపి కౌన్సిలర్?

కంచే చేనుమేసిన చందాన నెల్లూరు పెద్ద పోస్టాఫీసులో ఆర్‌డి ఖాతాలో దాచుకొన్న ప్రజల సొమ్మును ఏజంట్లు, పోస్టల్ సిబ్బంది కలసి ఒక పథకం ప్రకారం స్వాహా చేశారు. పోస్టల్ పొదుపు పథకాల్లో క్షేత్రీయ బచావ్ యోజన పథకానికి మంచి డిమాండ్ వుంది. చాలా మంది ఈ పథకంలో సభ్యులయ్యారు. సహజంగా ఆర్‌డి ఖాతాదారులు, ఏజంట్ల చేతికే తమ నెల పొదుపు మొత్తం డబ్బు ఇచ్చేస్తారు. ఏజంట్లు దాన్ని పోస్టాఫీసులో జమచేసి, పాసు పుస్తకంలో నమోదు చేయించి, సభ్యునికి తెచ్చిస్తుంటారు. కాని అత్యాశకు పోయిన కొందరు ఏజంట్లు ఈ డబ్బును స్వాహా చేసి ఆర్‌డి పాసు పుస్తకంలో తప్పుడు ఎంట్రీలువేసి, అధికారిక పోస్టల్ ముద్రకూడా గ్రుద్ది ఖాతాదారులకు ఇస్తూ వచ్చారట;పథకం కాల పరిమితి పదుసంవత్సరాలు కావడంతో ఇప్పటి వరకు ఎవరికీ అనుమానం రాలేదు. కాని ఇటీవల ఒక పొదుపు దారుడు తన ఖాతాను మూసేసి, డబ్బు తిరిగి తీసుకొను ఏజంట్‌తో ప్రమేయం లేకుండా నేరుగా పోస్టాఫీసుకు వెళ్లి అడగడంతో ఈ గోల్మాల్ బయటపడింది. పాస్ పుస్తకంలో ఒక మొత్తం, పోస్టల్ రికార్డుల్లో మరో మొత్తం వుండడంతో కుంభకోణం జరిగినట్లు నిర్ధారణకు వచ్చారు. ఎన్ని లక్షల మేర ఈ విధంగా ఏజంట్లు తిన్నారో తెలియదు? ఈ వ్యవహారంలో పోస్టల్ సిబ్బంది ప్రమేయం మీద పోస్టల్ సూపరింటెండెంట్ విచారణ చేయిస్తున్నారు. ఈ పథకం ఏజంట్‌గా వున్న టౌన్‌లోని బిజెపి మహిళా కౌన్సిలర్ ఒకరు భారీ మొత్తంలో ప్రజల సొమ్ము స్వాహా చేసినట్లు తెలిసింది. ఆమె కుటుంబీకులంతా డబ్బున్న వారు కావడంతో తిరిగి డబ్బు కట్టేసి ఈ వ్యవహారంలో నుండి బయటపడాలని ప్రయత్నిస్తున్నారట. పోస్టల్ శాఖలో సైతం ప్రజల డబ్బుకు భద్రత లేకుండా పోయిందే భగవంతుడా?

## వర్షం

2తేది నుంచి జిల్లా అంతటా ప్రతిరోజూ చిన్నపాటి జల్లులు కురుస్తున్నాయి. జల్లులు ఆశాజనకంగా వుండడంతో రైతులు ఖరీఫ్ సీజన్ పంటకు పొలం పనులు మొదలు పెడుతున్నారు.

## ఆగష్టులో నీరు విడుదల

జిల్లాలోని రైతులు వ్యవసాయ పనులు మొదలు పెట్టుకొనేందుకు వీలుగా ఆగష్టులో సోమశిల నీటిని వదలనున్నట్లు నీటిమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి ప్రకటించారు. గత ఏడాది అక్టోబర్‌లో నీటిని విడుదల చేయడంతో రైతులు సకాలానికి పంట పండించలేక ఇబ్బందులు పడ్డారు. ప్రస్తుతం సోమశిలలో 12 టిఎంసిల నీరు నిల్వవుంది. కడప జిల్లా నుంచి కుందునది వరద నీరు పెద్ద ఎత్తున వచ్చి చేరుతున్నది. ఆ నీటితోనే సోమశిల నిల్వ 16 లేదా 17 టిఎంసిల స్థాయికి చేరుకుంటుందని అంచనా. అదే జరిగితే నీటి విడుదలకు ఆగస్ట్ వరకు ఆగవలసిన అవసరం కూడా వుండదు. రైతులు ఈ ఏడాది కరువు బెడద తప్పించుకున్నట్లే లెక్క.

## రోడ్ల నిర్మాణం కోసం నియోజకవర్గానికి కోటి

నాబార్డు పథకం క్రింద జిల్లాలోని 11 నియోజక వర్గాల్లో రోడ్ల నిర్మాణం, మరమ్మత్తులకు నియోజక వర్గానికి కోటి రూపాయల చొప్పున 11 కోట్లు మంజూరయ్యాయి. ఈ నిధులను సక్రమంగా ఖర్చు పెడితే అధ్వాన్న స్థితిలో వున్న కొన్ని రోడ్లయినా బాగుపడతాయి.

## 64వేల మీటర్లకు దరఖాస్తులు

జిల్లాలో ఇటీవల నిర్వహించిన విద్యుత్ సదస్సుల్లో తమ కనెక్షన్లు క్రమబద్ధీకరించమని 64,808 మంది దరఖాస్తులు చేశారు. దరఖాస్తు రుసుంగా 2కోట్ల 19లక్షలు వసూలయ్యింది. ట్రాన్స్‌కో ప్రస్తుతమున్న సంక్షోభంలో దరఖాస్తుదారులందరికీ ఎప్పటి లోగా కొత్త మీటర్లిస్తుందనేది ఆ దేవుడికే ఎరుక!

## కమ్యూనిస్టుల నిరాహార దీక్షలు

విద్యుత్ ఛార్జీల పెంపకాన్ని వ్యతిరేకిస్తూ తొమ్మిది వామపక్షాల కార్యకర్తలు సంయుక్తంగా 5తేది టౌన్‌లోని వివిధ కూడళ్లలో రిలేనిరాహార దీక్షలు నిర్వహించారు. ఆత్మకూరు బస్టాండ్, గాంధీ బొమ్మ, మద్రాస్ బస్టాండ్, మండల కార్యాలయాల ఎదుట ఈ రిలే నిరాహార దీక్షల శిబిరాలు విజయవంతంగా నడిచాయి. ఈ శిబిరాల్లో ఉదయం నుండి సాయంత్రం వరకు దండిగా సిపిఎం, సిపిఐ కార్యకర్తలు కనిపించారు.

## కో ఆప్షన్‌కు మళ్లీ అప్లికేషన్లు

ఇటీవల కోరంలేక వాయిదా పడ్డ మునిసిపల్ కో ఆప్షన్ సభ్యుల ఎన్నికకు మళ్లీ దరఖాస్తులు ఆహ్వానించాలని నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ తీర్మానించింది. ఈ విషయమై కౌన్సిలర్ల అభిప్రాయాలు తెలుసుకొనేందుకు 5తేది ప్రత్యేక సమావేశం జరిపారు. కో ఆప్షన్ ఎన్నికకు మునిసిపల్ కౌన్సిల్ ఓకే అన్నా, ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చాకే ఎన్నికలు జరుగుతాయి.

వేమన జయంతి సభలో ఆచార్య రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డిని సన్మానిస్తున్న మాజీ అసెంబ్లీ స్పీకర్ రేబాల దశరథరామిరెడ్డి, రామసుబ్బారెడ్డి, దశరథరామిరెడ్డి, పాండురంగా రెడ్డి, వెంకురెడ్డి, పి.వి. రమణారెడ్డి ప్రక్కన వున్నారు

## టెలిఫోన్ బిల్లుల వసూలు కేంద్రాలు

నెల్లూరుటౌన్‌లో టెలిఫోన్ బిల్లులు కట్టించుకొనేందుకుకొత్తగా రెండు కేంద్రాలు ప్రారంభిస్తున్నారు. స్టోన్‌హౌస్‌పేట, ఏకెనగర్ టెలిఫోన్ ఎక్స్చేంజీలలో ఈ నెల 10తేది నుంచి టెలిఫోను బిల్లులు కట్టించుకొంటారు. ఈ ప్రాంతీయులు ఈ అవకాశాన్ని వినియోగించుకోమంటున్నారు టెలికాం జనరల్ మేనేజర్ ఎ. సుబ్బారావు.

## ఎసిబిడిఎస్పీ మూర్తి బదలీ

నెల్లూరు ఎసిబి డిఎస్పీ డివిఎస్ఎన్. మూర్తి బదలీ అయ్యారు. మూర్తిని తిరుపతి డిఎస్పీగా నియమించారు. ఈయన స్థానంలో చిత్తూరులో విఆర్‌లో వున్న తిమ్మప్పను నియమించారు. మూర్తి ఉత్తమ అధికారి. సాధారణంగా ముక్కుసూటిగా నడిచే పోలీసు అధికారులకు కోపం ముక్కు మీదే వుంటుంది. కాని మూర్తి గారిలో సౌమ్యత, వినయంతోపాటు తప్పు చిటపటలు కప్పించవు. ఆత్మాభిమానం చంపుకొని రాజకీయవాదులతో రాజీపడలేక, అట్టిని వారిని ప్రతిఘటించి వివాదాలలో తలదూర్చలేక సతమతమౌ తుంటారాయన. అటువంటి అధికారి, నెల్లూరు వదలి వెళ్లడం విచారకరం.

## కపాడిపాళెంలో మౌనపోరాటం

తనను ప్రేమించి వంచించిన ప్రియుడి ఇంటి ముందు, నెల్లూరు కపాడిపాళానికి చెందిన సునీత అనే యువతి జూన్ 30తేది నుంచి మౌనపోరాటం చేస్తున్నది. విఆర్ కాలేజీలో బికాం చదువుతున్న సునీత, కపాడిపాళెంకు చెందిన ఫోటోగ్రాఫర్ అంథోనిని ప్రేమించింది. ఆ తర్వాత పెళ్లి చేసుకోమని అడిగితే అతగాడు

కొరవ 8వ పేజీలో

## సణుగుడు

2వ పేజీ కొరవ

పాత్ర వుందని తెలిసినా - నేరువాయి లేని విసునాయుడు హిరప్రతాపం చూపించింది పోలీసు. ఇందుకు వారినీ తప్పు పట్టలేము; పెద్ద పెద్ద తలలతో పెట్టుకొంటే తమ తల బొప్పి కడుతుందని వారు భయపడడం సహజం. ఇక్కడ విచారించదగిన విషయం - కాంగ్రెస్‌పరంగా ఈ అరెస్టుపై స్పందన లేకపోవడం.

కార్యకర్తలలో ఉత్సాహం నిల్పగల్గితేనే ఏ ఉద్యమమైనా విజయవంతం అవుతుంది. నేతలు వేదికలెక్కి ఉపన్యాసాలు చేసేటప్పుడు క్రింద చప్పట్లు కొట్టడానికి కార్యకర్తలు తప్పనిసరి. అవసర వచ్చినప్పుడు మొత్తం పార్టీ తమకు అండగా నిలుస్తుందన్న నమ్మకం వుంటేనే కార్యకర్తలు ఉద్యమాలలో నిలువగల్గుతారు. వారిని గాలికి వదిలేస్తే - నష్టం పార్టీకి, ఉద్యమానికి. కాంగ్రెస్ పెద్దలు ఈ వాస్తవం మర్చి పోతున్నట్లున్నారు.

***

రమేష్‌రెడ్డిని అవమాన పరచడానికో, లేక అపహాస్యం చేయడానికో నేనీ ప్రతిపాదన చేయడం లేదు. నెల్లూరు తెలుగు రాజకీయాలలో రమేష్‌రెడ్డి పట్ల నాకు ఎప్పుడూ సదభిప్రాయమే వుంది. అతను విద్యావంతుడు కాకపోయినా, మేధావుల తరగతికి చెందకపోయినా, వేదికలపై నుంచి ఉద్రేకతలూపే ప్రసంగాలు చేయకపోయినా - జనాభిమానం పొందిన రాజకీయవాది. టౌన్‌లోని పేదలలో సింపతీ సంపాదించుకున్న అదృష్టజాతకుడు. ఇప్పుడు టౌన్‌లో వున్న రాజకీయ వాదులందరినీ ఒక ఎన్నికలో, పార్టీల ప్రమేయం లేకుండా పోటీ పడమని చెప్తే - అందరికంటే రమేష్‌రెడ్డికే ఎక్కువ ఓట్లు వస్తాయన్నది సత్యం కాని వాస్తవం. ఎటువంటి కుటుంబ నేపథ్యం లేకుండా, పర బలం లేకుండా, రాజకీయ చాణక్యం నేర్వకుండా అంత మాత్రం ప్రజల మద్దతు - అదీ పేద వర్గాల అభిమానం పొందగల్గడం సాహసమే కదా!

రమేష్‌రెడ్డి పైన అటువంటి సదభిప్రాయం కల్గి - బంట్రోతు బిళ్ల ఆయనకిచ్చేస్తే పోలేదా - అంటున్నానంటే, అందుకు కారణం మునిసిపల్ ఛైర్మన్ ప్రక్కన ఆయనట్లా కన్పడడమే! ఎస్‌ఎన్ టివి వార్తలలో రమేష్‌రెడ్డి కన్పడని రోజు వుండడం లేదు. "ఐ నెవర్ యూ సీ కలర్, థింక్ ఆఫ్ అజీ" అని చాలా కాలం క్రితం ఒక రంగుల కంపెనీ వ్యాపార ప్రకటన పాపులర్‌గా విన్పించేది. దానికి పేరడీ కట్టి - "ఐ నెవర్ యూ సీ రాజీవ్, థింక్ ఆఫ్ అజీ" అని అరుణిస్టేషా, అరుణిసింగ్‌లను గేలి చేస్తూ కార్టూన్లు వేసేవారు. ఇప్పుడు ఛైర్మన్ అనూరాధను చూసినప్పుడల్లా రమేష్‌రెడ్డిని చూడక తప్పడం లేదు నెల్లూరు పౌరులకు. ఛైర్మన్ దినసరి నగర పర్యటనల్లో, ఆమె కంటే ఒక అడుగు ముందుకు వేసి దారి చూపిస్తున్నారాయన; టివి కెమెరాకు అడ్డం రాకుండా జనాన్ని ప్రక్కకు జరుపుతున్నారు; సాధారణంగా ఈ పనులు చేసేది బిళ్ల బంట్రోతులు; ఆ డ్యూటీ చేస్తున్నారు కాబట్టి రమేష్‌రెడ్డి చొక్కాకే ఆ బిళ్ల పట్టీ తగిలించేయ కూడదా - అన్నది - కేవలం నా జోక్! నవ్వించడానికే తప్ప నొప్పించడానికి కాదండోయ్ ఈ మాట అంటున్నది! *

## కల్పలత

12వ పేజీ కొరవ

ఛైర్మన్ కోదూరు కల్పలత అధ్యక్షతన మునిసిపల్ బడ్జెట్ సమావేశం జరిగింది. అన్ని విధాలుగా మునిసిపాలిటీకి 3,06,53,700 రూపాయలొస్తుందని అంచనా వేశారు. పన్నుల రూపంలో 73లక్షల 34వేలు, ప్రభుత్వం గ్రాంట్లు 26లక్షల 41వేలు, వినోదపు పన్ను క్రింద 20లక్షలు, స్టాంపు డ్యూటీ క్రింద 20లక్షలు వస్తుందని లెక్కలు వేశారు. వివిధ ఫీజుల క్రింద 26లక్షల 76వేలు, పాఠశాలల గ్రాంటు ద్వారా 56లక్షలు వస్తుందని అంచనా వేశారు. ఖర్చుల క్రింద సిబ్బంది జీతాలకు కోటి 10లక్షలు, ఉపాధ్యాయుల జీతాలకు 52లక్షలు, చిల్లర ఖర్చులకు 31లక్షలు, అభివృద్ధి పనుల నిమిత్తం 82లక్షలు, ఇతర ఖర్చుల డిపాజిట్ల పద్దులో 29లక్షల 68వేలతో మొత్తం 3కోట్ల 27లక్షల 12వేలయ్యింది. బడ్జెట్‌కు మునిసిపల్ కౌన్సిలర్లు ఆమోదం తెలిపారు. ఇండిపెండెంట్ కౌన్సిలర్ నెల్లూరు రమణారెడ్డి మాట్లాడుతూ బడ్జెట్ వివరాల కాపీలు ముద్రించడానికి 19వేలు ఎందుకు ఖర్చు పెట్టాల్సి వచ్చిందని ఛైర్మన్‌ను నిలదీయగా, ఆమె సమాధానం చెప్పలేక పోయారు.

## నెల్లూరుముచ్చట్లు

5వ పేజీ కొరవ

లక్ష రూపాయలు కట్నం తెస్తేనే చేసుకొంటానని దబాయించాడట. దీంతో ఆమె ప్రియుని ఇంటి ముందు మౌనపోరాటం ప్రారంభించింది. దీక్షా శిబిరాన్ని 5తేది నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి సందర్శించి, ఈ వ్యవహారాన్ని జిల్లా కలెక్టర్, ఎస్పీల దృష్టికి తీసుకెళ్లారు. 6తేది మాజీ ఎమ్మెల్యే పనబాక లక్ష్మి, కాంగ్రెస్ నుంచి ఇటీవలే తెలుగుదేశం పార్టీకి వలస వెళ్లిన మహిళా నాయకురాలు బివి.లక్ష్మి, జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ తదితరులూ సునీతను పరామర్శించారు.

### మోసగాడి అరెస్ట్

ఉద్యోగాలిప్పిస్తానని నిరుద్యోగులను మోసం చేస్తుండిన విన్నకోటి వెంకటరావు అనే దగాకోరును నెల్లూరు సెంట్రల్ క్రైం స్టేషన్ ఇన్‌ఛార్జ్ ఆర్. వాగేశ్వరరావు అరెస్ట్ చేశారు. కోవూరు మండలం పెద్దపడుగుపాడుకు చెందిన వెంకటరావు తనకు తోటపల్లిగూడూరులో మందుల ఫ్యాక్టరీ వుందని, అందులో వుద్యోగాలిస్తానని చాలామంది నిరుద్యోగ యువకులను మోసగించాడట. నకిలీ లెటర్ హెడ్లు, రబ్బరు స్టాంపులు పెట్టుకొని నియామక ఉత్తర్వులిచ్చి డబ్బులు వసూలు చేసేవాడని క్రైం పోలీసులు చెబుతున్నారు. ఇతని వల్ల ఇంకా ఎవరైనా మోసపోయి వుంటే క్రైం పోలీసులకు తెలియజేయమంటున్నారు.

### దొంగ అరెస్ట్

నెల్లూరు కాపు వీధిలోని బంగారు షాపులో బంగారు గొలుసులు దొంగిలించిన ఒక దొంగను సెంట్రల్ క్రైం స్టేషన్ ఇన్‌ఛార్జ్ ఎస్‌ఐ నాగేశ్వరరావు అరెస్ట్ చేశారు. ఉదయగిరికి చెందిన మిర్జా అక్బర్ ఆలీ (28) వెంకటేశ్వరపురం సెంటర్‌లో తిరుగాడుతుండగా క్రైం ఎస్‌ఐ అనుమానించి, నిలేసి ఆరాతీసేసరికి అతని వద్ద 25 గ్రాముల బరువు కల్గిన 5 బంగారు గొలుసులు దొరికాయట. స్టేషన్‌కు తీసుకొచ్చి విచారించేసరికి దొంగతనాన్ని ఒప్పుకున్నాడు. కంటి అద్దాలు అమ్మే వ్యక్తిగా నటిస్తూ తిరుగుతూ దొంగతనాలు చేయడం ఆలీ స్పెషాలిటీ అట. *

## గూడూరు

12వ పేజీ కొరవ

శారద వెంకటగిరి, డక్కిలి, బాలాయపల్లి ఓజిలి మండలాల్లో పర్యటించి పెరిగిన విద్యుత్ ఛార్జీల పట్ల ప్రజలు కోపంగా లేరని చెప్పారు. ఇటువంటి కష్ట సమయాల్లోనే ప్రజలు ముఖ్యమంత్రికి అండగా వుండాలన్నారు. తాను వెంకటగిరి అభివృద్ధికి 10కోట్లు మంజూరు చేయించినట్లు డంబాలు పలికారు. గొడ్డేరు ఆనకట్ట పనులను కూడా ఆమె పరిశీలించారు.

## పోలీసు

మొదటి పేజీ కొరవ

స్థాయి మధ్యస్తాల విషయంలో దాపరికం ఏదీ లేదు. కొన్ని సంవత్సరాలుగా ఆ పద్ధతి అమలు జరుగుతూవుంది. అందువల్లే ఈ వార్తలో ఎవరి పేరూ వ్రాయడం లేదు. ఆ పోస్టులలో ఎవరున్నా ఆయా పనులు చేసి తీరాల్సిందే. అందుకు సిద్ధపడిన వారికే టౌన్ పోస్టింగులు లభిస్తాయి. ఎస్పీలు, డీఐజీలు, ఐజీలు వంటి వారందరికీ తెలిసే జరిగే కార్యక్రమం. తాను రైళ్ళెక్కినప్పుడు తనను డబ్బడగకుండా టిక్కెట్ తెచ్చిచ్చేవాడు, తను తిన్నంత తిండి, త్రాగినంత విస్కీ పోసేవాడు ఆ ఖర్చు తన జేబు నుంచి పెట్టడన్న నిజం ఐజీలకు తెలియకుండా ఎట్లా వుంటుంది? అందువల్ల మామూళ్లు తప్పు ఎస్‌ఐ, సిఐలది ఎంత మాత్రం కాదు; అందుకు వారిని మేమూ తప్పుపట్టడం లేదు. లెక్కలు సరదాగా వున్నాయి కాబట్టి, పాఠకులు చదివి ఆనందించడం వరకే ఈ వార్త ఉద్దేశ్యం.

ఒక క్రమబద్ధ చెయిన్ వలె సాఫీగా నడిచిపోతుండిన వ్యవహారం త్రీ టౌన్ కొత్త ఎస్‌ఐ రాంబాబుతో బ్రేక్ పడింది. లంచం తినేది లేదు, పై అధికార్లకు పంచేది లేదు అని భీష్మించుకొనడంతో సమస్య వచ్చింది. తన స్టేషన్‌లో ఎటువంటి మధ్యస్తాలూ జరగవనీ తేల్చి చెప్పేశాడట రాంబాబు; ఎమ్మెల్యేకాని, మంత్రికాని - సిఫార్సులు ససేమిరా వినడం లేదు; బ్రాందీ షాపుల వారు పంపిన నెలమామూలు మొత్తాన్ని విసిరిపారేశాడట. ఇటువంటి ఆదర్శాలు పాటించే అధికారులు బ్రతకడం చాలా కష్టం; కాని అటువంటి వారు నూటికొకరైనా వుంటేనే పోలీసు అనే పదానికి జనంలో గౌరవం. త్రీటౌన్ వంటి కీలక స్టేషన్‌లో రాంబాబు వంటి నిజాయితీపరుడ్ని, నిఖార్సు వ్యక్తిని నియమించినందుకు తలవాచుకొంటున్నాడట ఎస్పీగారు! ఇప్పటికిప్పుడు ఆయన్ను బదలీ చేస్తే జనంలో గగ్గోలు రేగుతుంది, కొనసాగిస్తే తమ వంటి ఉన్నతాధికార్లకు సరఫరాలలో లోపం జరుగుతుంది. పెద్ద చిక్కే పాపం!

రామాయణంలో పిడకల వేట వలె ఈ కథకు ఒక ఉప కథ వుంది. వన్‌టౌన్ ఎస్‌ఐ సర్రాప్రహ్మణుడు; శాఖాహారి. "మేలు,



బాలాయపల్లిలో విఆర్‌ఓ క్వార్టర్సును ప్రారంభిస్తున్న వెంకటగిరి ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ, ప్రక్కన ఎస్పీ సి.వి. నరసయ్య వున్నారు.

మూసం మోసే డ్యూటీ నా నుంచి తప్పించండి, అందుకయ్యే ఖర్చు కలెక్టీ రూపంలో ఇచ్చుకుంటాను మహాప్రభో" అని మొరపెట్టుకొంటున్నాడట, ఆ కోరిక విన్నవించు కోవడానికి వెళ్లినందుకు పరిహారంగా - ఒక ఉన్నతాధికారి ఎయిర్ కండిషనర్, మరొక అధికారి ఎయిర్ కూలరు జరిమానా విధించారట పాపమాతడికి, లబోదిబో మంటూ తిరిగి వచ్చి బ్రాందీరోడ్డు షాపు యజమానుల కాళ్లావేళ్లాపడి పై వారికి పరిహారం చెల్లించుకున్నాడు!

ఈ వార్తాంశాలకు ఎటువంటి వ్యాఖ్యానాలు జతచేర్చడం లేదు మేము; ఎస్‌ఐల దుస్థితికి జాలిపడి, అయ్యోపాపం అనడం తప్ప!

## కలెక్టర్

మొదటి పేజీ కొరవ .

పోవడం ఆమె దృఢ సంకల్పానికి నిదర్శనం. కండ్లేరు రిజర్వాయర్ హెడ్ స్లూయిస్ నాసిరకం నిర్మాణంపై ఆందోళన చెలరేగినప్పుడు - నిర్భయంగా, నిర్మొగమాటంగా ముఖ్యమంత్రికి నివేదిక పంపారామె. ఆ నిర్మాణంలో లోపాలున్నది వాస్తవం, అందువల్ల భవిష్యత్‌లో ఏదైనా అనర్థం జరిగితే అందుకు జిల్లా అధికార యంత్రాంగం బాధ్యత ఏ మాత్రం వుండదు. అని సాక్షాత్తు ముఖ్యమంత్రికి తెగేసి చెప్పగల ధైర్యం ఎందరు అధికార్లలో వుంటుంది? కండ్లేరు నది వద్దున రొయ్యల చెరువులు త్రవ్వకం విషయంలోనూ శ్రీలక్ష్మి గారు రాజకీయవాదుల వత్తిడులు తిరస్కరించి సాహసోపేత నిర్ణయం తీసుకున్నారు.

కపటం లేకుండా, వున్నది వున్నట్లు మాట్లాడే ఈ వైఖరి వల్లనే ఆమె తరచు వివాదాలలోకి ఎక్కేవారు. వాటివల్ల వచ్చే ఉద్రిక్తతలతో ఆమె కొందరి పట్ల అభిమానం, మరికొందరి పట్ల అసహనం పెంచుకోవలసి వచ్చింది. రాజకీయ వాదులలో కాని, క్రింది ఉద్యోగులలో కాని - ఆమె అంటే పిచ్చి అభిమానం కల్గినవారు కొందరైతే, పచ్చిద్వేషం పెంచుకొన్నవారు ఇంకొందరు.

పత్రికల పట్ల శ్రీలక్ష్మి గారికి మక్కువ ఎక్కువ; చంద్రబాబు ప్రస్తావన లేని రోజైనా వుంటుంది కాని - కలెక్టర్ ఫోటో లేకుండా ప్రచురితమైన దినపత్రికలు అరుదు. ప్రతి నిత్యం ఆమె వార్తా ప్రకటన వుండి తీరాల్సిందే!

ఆమెను నెల్లూరీయులు గుర్తుంచుకొనే ఏకైక సంస్థ - పిల్లల పార్కు. రెడ్‌క్రాస్ బ్లడ్ బ్యాంక్, స్పాస్టిక్ సెంటర్, క్యాన్సర్ ఆస్పత్రి వంటి సంస్థల ఆవిర్భావంలోనూ ప్రమేయం వున్నా - పిల్లల పార్కులో తాదాత్మ్యం చెందారామె. ఎన్ని వివాదాలు, ఎంత రచ్చలు, ఎన్ని ఆరోపణలు చెలరేగినా వాటికి వెన్నెముక వాని విలువ ఇవ్వకుండా తను అనుకున్నవని, అనుకున్నట్లు జరిపించుకోగలిగారు. ఈ రభస జనం మర్చిపోతారు; అందమైన పార్కు మాత్రం నెల్లూరీయులకు రోజూ ఆమె పేరు జ్ఞాపకం చేస్తూనే వుంటుంది.

అయ్యో అప్పుడె వెళ్లిపోతున్నదే అని దిగులుపడేవారు; అమ్మయ్య వెళ్లిపోయింది - అని సంతోషపడేవారు సమంగా వుండడం - శ్రీలక్ష్మిగారి వ్యవహార శైలికి వివరణ అవసరం లేని ఉదాహరణ. ఆమెకు మా హృదయపూర్వక వీడ్కోలు!

***

"ఈ బదలీ నాకృషి ఫలితం అంటున్నాడు - సర్వేపల్లి ఎమ్మెల్యే సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. ఊరమ్మ కన్న బిడ్డకు తండ్రిని అని చెప్పుకోవడం వంటిదే ఇది. కలెక్టర్ గారిని సాగనంపడానికి ఒకటిన్నర సంవత్సరంగా తలక్రిందుల తపస్సు చేస్తున్న మాట నిజం. ఎన్నికల ముందు మంత్రిగానే ఆ ప్రయత్నం మొదలు పెట్టాడు. ముఖ్యమంత్రి వద్దకు ఎన్నో రాయబారాలు నడిపాడు; బదలీ అయిపోయిందని ఒకటి రెండు సార్లు పత్రికాఫీసులకు ఫోన్లు చేసి చెప్పాడు. అప్పుడెప్పుడో చెల్లుబాటు కాని మాట ఇప్పుడెట్లా చెల్లుతుంది! కలెక్టర్ బదలీ పట్ల సంతోషించే వారిలో చంద్రమోహన్‌రెడ్డి ప్రథముడన్నది మాత్రం అందరం ఒప్పుకోవాలి; అది నేనే చేయించాను అని ఆయన కాలరెగరేస్తే - కాదనడానికి మనమెవరం? ఎవరి పిచ్చి వారికానందం కదా!" *

## విజయవాడ

మొదటి పేజీ కొరవ

ప్రసక్తి లేదని ఆయన, తగ్గించే వరకు ఉద్యమం ఆపే పని లేదని ప్రతిపక్షాలు - రెండు ప్రక్కలా పట్టుదలలు దృఢంగానే వున్నాయి.

కాంగ్రెస్, కమ్యూనిస్టుల ఆందోళనను త్రిప్పికొట్టడానికి ప్రతి జిల్లా కేంద్రంలో మండలాలలో సభలు, ర్యాలీలు జరపమని ముఖ్యమంత్రి పదే పదే కోరుతున్నా ఒక్క మంత్రి, ఒక్క తెలుగు ఎమ్మెల్యే అందుకు సాహసించడం లేదు. ఛార్జీల పెంపకం సమంజసమని వేదికెక్కి చెప్తే జనం రాళ్లతో కొడతారన్న భయం వుంది వీరిలో. అందువల్లే చంద్రబాబు ఆదేశాలు విని, వినకుండా పోతున్నారు. విద్యుత్ విషయం ప్రస్తావించకుండా గుంటూరులో జరిగిన విధ్వంసకాండకు నిరసన పేరుతో రేపు 12తేది ఒక ర్యాలీ తలపెట్టాడు ముఖ్యమంత్రి. అయితే అందులో తాను పాల్గొనకుండా జాగ్రత్త పడుతున్నారాయన. తాను హాజరైన సభ విఫలమైతే ప్రతిపక్షాలు మరీ రెచ్చిపోతాయన్నది భయం. ఎటువంటి సమస్య వచ్చినా, ఎంతటి నిరసనలు వ్యక్తమైనా ప్రత్యక్షంగా ప్రజల ముందుకు వచ్చి, వారితో మాట్లాడి, నచ్చచెప్పి, వెళ్లడం చంద్రబాబు రాజకీయశైలి; ఇప్పుడాయన అదే ప్రజల ఎదుట పడడానికి భయపడుతున్నాడు. రాష్ట్రంలో విద్యుత్ సమస్య ఎంత తీవ్ర రూపం ధరించి వుందో చెప్పడానికి వేరే నిదర్శనమే అవసరం లేదు. *

# అంతా "అన్నయ్య" పుణ్యమే

వరుస విజయాలు సాధిస్తున్న హీరో పవన్ కళ్యాణ్‌ను, ఇంత మంది అభిమానులను, ఇంత ఇమేజ్‌ను సంపాదించుకొన్నందుకు ఎలా ఫీలవుతున్నారని అడిగాను. ఈ వ్యవహారంలో తన గొప్పతనమేమి లేదని చెబుతూ, ఈ క్రెడిట్ అంతా తన సోదరుడు మెగాస్టార్ చిరంజీవికే చెందుతుందన్నారు. నన్ను అభిమానిస్తున్న వాళ్లంతా మా అన్నయ్య అభిమానులే. నాకంటూ స్వతంత్ర్య గుర్తింపు రాలేదని నేను భావిస్తున్నాను. దానికింకా సమయం పట్టవచ్చు. అందుకే నేను ఏదో సాధించేశానన్న ఫీలింగ్ కలగడం లేదు. తాను గొప్పవాడినన్న ఫీలింగ్ కూడా తనకు లేదన్నారు.

## చిరంజీవిపై పవన్ భక్తి

## స్వదేశంలో షాపింగ్‌కు వెళ్తే కష్టాలు!

తాను విదేశాల్లోనే షాపింగ్‌కు ఇష్టపడతానని హీరోయిన్ రంభ చెప్పింది. మనదేశంలో ఎక్కడైనా షాపింగ్‌కు వెళ్తే నేను ఒక సినిమా స్టార్‌నని గుర్తు పట్టేస్తారు. దీంతో అన్నిటికన్నా ఖరీదైన వస్తువులు మాత్రమే చూపిస్తారు. కొంచెం తక్కువ రేట్స్‌లో చూపించమంటే నేనేదో బూతు మాట మాట్లాడుతున్నట్లు చూస్తారు. 'మీరు అవి అడుగుతారేంటి మేడమ్' అంటారు. నేను సినిమా హీరోయిన్‌ని అయినా నా లిమిటేషన్స్ నాకుంటాయి కదా? అదే విదేశాల్లో అయితే చాలా నిర్మొహమాటంగా డీల్ చేయవచ్చని రంభ వివరించింది.

## విదేశాల్లో షాపింగ్ చేయలేం

రంభ విదేశాల్లో షాపింగ్ చేయడం తేలికంటుంటే, విదేశాల్లో షాపింగ్ చేయడం కష్టమంటున్నారు ఆలీ. సురేష్ ప్రొడక్షన్స్ యూనిట్‌లో ఇటీవల యూరప్ దేశాలకు వెళ్లి వచ్చిన ఆలీ ఏం తెచ్చుకొన్నారని ప్రశ్నిస్తే, చాలా అమూల్యమైనవి తెచ్చుకొన్నట్లు చెప్పారు. అవేమిటో చెప్పండని ప్రశ్నిస్తే.. 'జ్ఞాపకాలు' అని నవ్వేశారు. విదేశాల్లో షాపింగ్ గూర్చి వివరిస్తూ అక్కడ ఒక కిచైన్ కొనాలంటే మన కరెన్సీ ప్రకారం ఐదు వందల రూపాయలవుతాయి. అక్కడి వాళ్ల రేంజ్ అది. మన రేంజ్ వేరు. అందుకే యూరప్‌లో 'విండో' షాపింగ్‌తో తాను తృప్తిపడ్డానని ఆలీ చెప్పారు.

# సంపాదనపై ఇంకా ఎందుకే యావ!

గత సంవత్సరం 'రజనీ - 25' పేరుతో రజనీ కాంత్ సినీ రజతోత్సవ వేడుకలను నెలరోజుల పాటు మద్రాస్‌లో జరిపారు. ఇప్పుడు ఆ ఉత్సవాలను టి.వి.లో సీరియలైజ్ చేయడానికి ఆయన భార్య లత పూనుకున్నారు. ఈ విషయం రజనీకాంత్‌కు చెప్పి వారం వారం ఈ సీరియల్ ప్రారంభంలో రజనీకాంత్‌ను రెండు మాటలు చెప్పమని కోరారట. వేరే హీరోలైతే భార్యమాటను కాదనే వారుకాదు. కాని రజనీధోరణి వేరుకదా? భార్యపై చిరుకోపం ప్రదర్శించి 'ఈ సీరియల్ వల్ల నీకు ఎంత డబ్బు వస్తుందో దానిని నేనిస్తాను, నన్నొదిలెయ్' - వున్న డబ్బుతో సంతృప్తి పడకపోతే జీవితం వ్యర్థమని సలహా యిచ్చారట. రజనీకాంత్ ఏడాదికి ఒక సినిమాలో నటిస్తారు. దానికి 8 కోట్ల పారితోషికం తీసుకుంటారు. సంపాదించిన డబ్బు ఏం చేసుకోవాలో తెలియక రజనీ తికమక పడుతుంటే ఇంకా సంపాదనకు భార్య ప్రయత్నించడం రజనీకి విసుగు పుట్టినట్టుంది.

## పెళ్లి పరిస్థితులను మార్చింది.

పెళ్లి తన జీవితంలో ఎంతో మార్పును తీసుకొచ్చిందంటున్నారు హీరో పృథ్వీ. నాకు చిన్నప్పటి నుంచి ఏవిధంగానైనా ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకోవాలనే కోరిక ఉండేది. అందువల్లనే తొమ్మిదోతరగతి చదువుతున్నప్పుడే ఒక అమ్మాయిని ప్రేమించాను. కాని ప్రేమ విఫలమయ్యింది. అయినా పట్టువదలని విక్రమార్కుడిలా మరో అమ్మాయిని ప్రేమించాను. ముందు నేను ప్రేమించిన అమ్మాయి గూర్చి వివరించాను. ఈ అమ్మాయి నన్నుఅర్థం చేసుకొని పెళ్లి చేసుకుంటానంది. మూడేళ్ల తర్వాత ఆ హామిని నిలబెట్టుకుంది. నాకు పెళ్లయిన తర్వాత ఎన్నో టి.వి. సీరియల్స్‌లో నటించే అవకాశాలొచ్చాయి. నటుడిగా బిజీ అయ్యాను. 'పెళ్లి' చిత్రంద్వారా తెలుగు సినిమా పరిశ్రమలో నిలదొక్కుకున్నాను. నా జీవితంలో పరిస్థితులను మార్చిన 'పెళ్లి' తన జీవితంలో అత్యంత ముఖ్యఘట్టమన్నారాయన.

## భార్యను నిలదీసిన రజనీకాంత్

## కథ తర్వాతే సంగీతం

ఘరానా మొగుడు, క్షణ క్షణం, అల్లరి మొగుడు, అల్లరి ప్రియుడు, సీతారామయ్యగారి మనవరాలు, సుందరకాండ, మేజర్ చంద్రకాంత్, పెళ్లి సందడి వంటి మ్యూజికల్ హిట్స్ చిత్రాలకు సంగీతం సమకూర్చిన 'కీరవాణి' చేతుల్లో ప్రస్తుతం చిత్రాలు లేవు. ఈ విషయాన్ని 'చూసొద్దాంరండి' షూటింగ్ లో కలసిన కీరవాణిని ప్రశ్నిస్తే ఒక చిరునవ్వు నవ్వి... మంచి సంగీతానికి ముఖ్యమైంది కథ. కథ

తరువ 11వ పేజీలో

# కొత్త సీసాలో పాత సారా 'ఒక్కడుచాలు'

ఈ చిత్రం కథ సమకాలీన వాతావరణంపై ఆధారపడింది. ప్రతి నగరంలో అర్థ బలం, అంగ బలం, అవినీతి బలగం రాజ్యమేలుతూ వుంది. రౌడీయిజం, గూండాయిజం, రాజకీయ కుతంత్రం, వీరవిహారం చేస్తున్నాయి. అన్యాయానికి, అక్రమాలకు, అవినీతికి, దోపిడి విధానానికి ప్రజానీకం బలైపోతున్నారు. నరకాన్ని అనుభవిస్తున్నారు. సరైన కూడు, గుడ్డకు నోచుకొని కరవు కాలాన్ని ఎదుర్కొంటున్నారు. చాలా చోట్ల మారణాయుధాల మందిరాలు వెలుస్తున్నాయి. ఘతోన్మాదం, పదవీ వ్యామోహం, శాంతి దేవతకు సమాధులు నిర్మిస్తున్నాయి. ఇలాంటి భయానక జ్వలిత జ్వాలల్లో సమాజం అట్టుడికి పోతూవుంది.

ఈ విషపూరిత వాతావరణాన్ని, ఈ అమానుషచర్యలను అంత మొందించవలసిన అవసరం ఎంతైనా వుంది. దురంధ రాజకీయ మారణహోమంలో మసి బొగ్గులైపోతున్న మమత, మానవత్వం, నీతి, నిజాయితీ, సుఖ, శాంతులను పరిరక్షించుకోవలసిన అవసరం వుంది. రాజకీయం సృష్టించే ఉగ్రవాదంలో, స్వార్థం ప్రేరేపించి, ప్రోత్సాహించే మాదక ద్రవ్యాలు, మతోన్మాదం, మత్తులో నరలోకం నరకలోకం కాకుండా, స్వర్ణధామం, స్వర్ణ వైభోగ దర్పణంగా రూపుదాల్చేందుకు శ్రమించవలసిన అవసరం వుంది.

ఈ అవసరాలన్నీ నెరవేర్చేందుకు పోలీస్ అధికారి "ఒక్కడు చాలు". ఆ అధికారి మానవతకు, నీతికి, నవ్యతకు ప్రాణంగా నిలవాలి. మంచి కోసం, మనిషికోసం, సమాజం కోసం ప్రాణ త్యాగం చేసేందుకు సిద్ధపడాలి. దానవత్వాన్ని హతమార్చి, మానవత్వాన్ని బ్రతికించే వాడి, వేడి, తాండవకేళి అతనిలో

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

విజృంభించి, విస్తరించాలి. బాధితుల భుజం తట్టి ముందుకు ఉరికించే కార్యదక్షత అతనిలో విశిష్టంగా బలపడాలి. ఇలా చేవ, చైతన్యం మూర్తీభవించిన తేజోనిధి, ఉజ్వల ఉద్యోగ రథసారథి అయిన ఒక పోలీస్ అధికారిని శ్రీమ్మై క్రియేషన్స్ వారు నిర్మించిన "ఒక్కడు చాలు" చిత్రంలో దర్శకుడు రవిరాజా పినిశెట్టి ప్రతిష్ఠించాడు. ఆ అధికారి పేరు సూర్య (డాక్టర్ రాజశేఖర్)

ఈ సూర్య చిన్నతనంలో, తన తల్లిదండ్రులను అన్యాయంగా చంపిన ఒక పోలీస్‌ను వెనుకనుంచి ఇనుప కమ్మితో పొడిచి చంపేస్తాడు. సూర్యాన్ని కోర్టువారు "రిఫారం" స్కూలుకు పంపుతారు. ఆ తర్వాత అతన్ని ఒక మిలటరీ అతను పెంచుకుంటాడు. ఇతనికి సురేష్ (సురేష్) అనే కుమారుడుంటాడు. సూర్య ఎదిగి, చదివి పోలీస్ ఎస్పీ అవుతాడు. అతను నిప్పులాంటి అధికారి. తన తల్లిదండ్రులను చంపిన వారిని హతమార్చేందుకు పూనుకుంటాడు. సమాజంలో మంచిని, మానవత్వాన్ని గెలిపించేందుకు కంకణం కడతాడు. సమాజాన్ని, పోలీసు శాఖను గజగజలాడిస్తున్న మంత్రి అప్పలనాయుడు (రామిరెడ్డి), డాన్ ధన్‌రాజ్‌ల (శరత్‌సక్సేనా) అంతు తేల్చేందుకు తన ఆగ్రహాన్ని, ఆవేశాన్ని ఆయుధాలుగా చేస్తాడు. అతని ధాటికి తట్టుకోలేని మంత్రి, డాన్‌లు మాదక ద్రవ్యాల లోలుడైన సురేష్‌ను అడ్డం పెట్టుకొని, సూర్యను అకట్టుకునేందుకు ప్రయత్నిస్తాడు. దీనికి లొంగని సూర్య దుర్మార్గులను హతమారుస్తాడు. దానవత్వాన్ని హతమార్చి, మానవత్వాన్ని బ్రతికించేందుకు నీతిమంతుడైన అధికారి "ఒక్కడు చాలు" అని

తరువ 11వ పేజీలో

ఎన్‌పి ఎంటర్‌టైన్‌మెంట్స్ చిత్రంలో షహీన్.

# ఎలుకలతో 'కమల్' సినిమా

తాను నటించే చిత్రంలో ఏదో ఒక ప్రత్యేకత వుండేలా చేయడం కమల్ హాసన్ స్పెషాలిటీ. తాజాగా ఆయన నటిస్తున్న తెనాలి చిత్రంలో ఆయన ఎలుకలతో కలసి నటిస్తున్నారు. మొదట ఈ చిత్రంలో ఈ సన్నివేశాలు తక్కువగానే అనుకున్నప్పటికీ, షూటింగ్ మొదలు పెట్టాక ఈ సన్నివేశాల సంఖ్యను పెంచారట. కారణమేమిటంటే, ఎలుకలు నటనలో కమల్‌తో పోటీ పడుతున్నాయట. సన్నివేశాలు బాగా వస్తుండడంతో స్పాంటేనియస్‌గా దృశ్యాలు తీస్తున్నారు. ఈ ఎలుకలకు నలుగురు ట్రైనీలట. ఎలుక కన్నా ట్రైనీలకు ఎక్కువ ఖర్చవుతుందని యూనిట్‌లో వాళ్లు చెబుతున్నారు.

## హైదరాబాదు సినిమా వార్తలు

## నా జీవితం ధన్యమయ్యింది

షాలినిని తాను వివాహం చేసుకోవడంతో తన జీవితం ధన్యమైనట్లు భావిస్తున్నట్లు హీరో అజిత్ చెప్పారు. రెండు నెలల హనీమూన్ ట్రిప్ పూర్తి చేసుకొని వచ్చిన అజిత్ తన ప్రేమానుభవాలు వివరించారు. నేను మొదటిసారి షాలూని చూసినప్పుడే నాలో ఏదో మార్పుని గమనించాను. వ్యక్తిగతంగా ఆమె ప్రేమకోసం పరితపించాను. ప్రేమ విరహంతో వేగిపోయాను. షాలూని చూసిన మొదటి చూపులోనే నేను పడిన తపనకు ఫలితం సిద్ధించింది. ఆమె పరిచయంతో నాలోకం మారిపోయింది. ఆమె స్నేహంతో నా వ్యక్తిత్వం వికసించింది. ఆమె ప్రేమతో నా స్వప్నం నిజమయ్యింది. ఐరోపా హనీమూన్ ట్రిప్ తమను ఇంకా దగ్గర చేసిందన్నారు.

# మనసులు కలిస్తే మనువెందుకు?

సింధూర పువ్వు చిత్రంలో హీరో, హీరోయిన్లు రాంకీ, నిరోషా పెద్దల ఎదుట పెళ్లి చేసుకోలేదు. రిజిష్టర్ మ్యారేజ్ కోసం ప్రయత్నం చేయకుండానే కలిసిబతుకుతున్నారు. ఎవరైన అప్తులు ఇదేమిటని ప్రశ్నిస్తే సంసారానికి, పిల్లల్ని కనేందుకు పెళ్లెందుకు

## రాంకీ, నిరోషా

దంతగ, మనసులు కలిస్తే అదే మనువవుతుందని చెబుతున్నారు వేదమంత్రాలు. కాగితాలమీద సంతకాలతో జీవితాలు నిలుస్తాయా అని మెట్ట వేదాంతం చెబుతున్నారు. ఈ మధ్య రాంకీకి వేషాలు బాగా తగ్గాయి. దీంతో నిరోషా తన అక్క రాధిక చేత రెకమెండేషన్ చేయించుకొని వేషాలను సంపాదిస్తుంది. ఇది వరకు రాంకి షూటింగులకు వెళ్తుంటే నిరోషా వంట చేసేదట. ఇప్పుడు నిరోషా వెళ్తుంటే రాంకి కమ్మని వంట చేసి పెడుతున్నాడని నిరోషా సర్టిఫికేట్ ఇచ్చింది. ధన్యోస్మి రాంకి!

## మీనా ప్రతిభ

సంవత్సరానికి ఒక్క చిత్రంలో మాత్రమే నటించే రజనీకాంత్ ప్రక్కన నటించను పలువురు కథానాయికలు తహతహలాడుతుంటారు. ముత్తు చిత్రంలో రజనీ సరసన నటించిన మీనా తర్వాతి చిత్రం పడయప్పాలో ఛాన్స్ వస్తుందని భావించింది. ఆ ఛాన్స్ సౌందర్యకు తగిలింది. ఈ ఎదురు దెబ్బతో ఖంగు తన్న మీనా, రజనీకాంత్ నటించే తదుపరి చిత్రంలో ఛాన్స్ కోసం ఆయన ఇంటి చుట్టూ కాళ్లరిగేలా తిరిగి, ఒప్పించింది. మీనా పట్టుదలకు మిగతా హీరోయిన్లు తెల్లబోయారు.

# వారఫలాలు

8-7-2000తేది నుండి 16-7-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రవి, కుజ, బుధులు; కర్కాటకంలో శుక్ర, రాహువులు; మకరంలో కేతువు; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు.

## మేషం
(అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో రాబడి పెరుగుతుంది. కొద్దిపాటి విభేదాలు కుటుంబ సభ్యులతో కలుగవచ్చును. సొంత పనులు నిదానంగా జరుగుతాయి. గృహ రిపేర్లు, వస్తు రిపేర్లు రావచ్చును. రావలసిన బాకీలు కొద్దిగా లభిస్తాయి. వ్యవహారాలు, కేసులు రాజీ చేసుకొంటే మంచిది. బంధువులతో జాగ్రత్తగా వ్యవహరించండి. తగాదాలు రాగల అవకాశాలున్నాయి.

## వృషభం
(కృత్తిక, 2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆదాయం, ఖర్చులు సమానంగా ఉంటాయి. వృత్తి, వ్యాపార రంగాలలో శ్రమకు తగ్గ రాబడి ఉండదు. దూర ప్రయాణాలు, బంధుమిత్రులను కలుసు కొనడం ఉంటుంది. సొంత పనులు నిదానంగా జరుగుతాయి. ఉద్యోగులకు పనిభారం పెరుగుతుంది. అధికారుల సహకారం బాగుంటుంది. ఇంటి రిపేర్లు, కొత్త వస్తువులు సమకూర్చుకొనడం జరుగుతుంది.

## మిధునం
(మృగశిర, 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆదాయం కంటే ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. అవసరాలకు ఋణం చేయవలసి వస్తుంది. అధికారుల సహకారం సరిగా ఉండదు. ఉద్యోగబాధ్యతలు పెరుగుతాయి. సహాయపడవలసిన వాళ్లు తప్పుకొంటారు. ఉద్యోగులకు స్థానమార్పులు, శుభ కార్య నిర్ణయాలుంటాయి. వారం మధ్యలో ఆరోగ్య లోపం ఉంటుంది.

## కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

ఆర్థికపరిస్థితి బాగుంటుంది. అప్పుడప్పుడు కొత్త ఆలోచనలు కలిగి మనస్థిమితం సరిగా ఉండదు. పనులకు ఆటంకాలు కలుగుతుంటాయి. అధికారులతో జాగ్రత్తగా మెలగాలి. వ్యాపార విషయాలలో, డబ్బు లావాదేవీలలో కొంత పేచీలు రావచ్చును. బంధువుల అనారోగ్య వార్తలు వింటారు. వారాంతంలో ఆరోగ్యం సరిగా ఉండదు. ఇంట్లో శుభకార్య నిర్ణయాలు జరుగుతాయి. ఉద్యోగులకు బాధ్యతలు పెరుగుతాయి.

## సింహం
(మఘ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. కుటుంబ ఖర్చులు పెరుగుతాయి. సొంత పనులకు ఆటంకాలు రావు. బంధువుల, చిరకాల మిత్రుల రాకపోకలుంటాయి. శుభకార్య నిర్ణయాలకు అవకాశాలున్నాయి. అనుకోని ప్రయాణాలు, ఆహ్వానాలు లభించవచ్చును. కొత్త వస్తువులు కొనడం, ఇంటికి సంబంధించిన వసతులు కల్పించుకొంటారు.

## కన్య
(ఉత్తర 2, 3, 4 పాదాలు, హస్త; చిత్త 1,2 పాదాలు)

ఆర్థికపరిస్థితి బాగుంటుంది. రావలసిన బాకీలు కొంత లభిస్తాయి. పెట్టుబడి రంగంలో ఆదాయం బాగుంటుంది. శుభవార్తలు వింటారు. బంధుమిత్రుల సహకారం బాగుంటుంది. ఉద్యోగులకు అధికారుల సహకారం బాగుంటుంది. వస్తు, వాహన రిపేర్లుంటాయి. ముఖ్యపనులకు ఇతరుల సహకారం లభిస్తుంది. విద్యాప్రగతి బాగుంటుంది. దైవకార్యాలలో పాల్గొంటారు.

## పంచాంగం

**జూలై తిథులు**

తేది 12 బుధవారం తొలిఏకాదశి.
తేది 14 శుక్రవారం శుక్రమౌఢ్యమి సమాప్తి.

**ఆషాఢ శుద్ధ**

తేది 8శని సప్తమి ప 11.30గ ం. ప
తేది 9 ఆది అష్టమి ఉ 10.45 గం.వ
తేది 10 సోమ నవమి ఉ 10.28 గం.వ
తేది 11 మంగళ దశమి ఉ 10.45 గం.వ
తేది 12 బుధ ఏకాదశి ఉ 11.25 గం.వ
తేది 13 బేస్త ద్వాదశి ప 12.40 గం.వ
తేది 14 శుక్ర త్రయోదశి ప 2.15 గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.

## తుల
(చిత్త 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ఆర్థికపరమైన చిక్కులు కలుగవచ్చు కాబట్టి పరిస్థితి గమనించుకొనాలి. వ్యాపార, వ్యవసాయ రంగాలలో సామాన్య ఆదాయం వారాంతంలో డబ్బుకు ఇబ్బంది పడతారు. ముఖ్య అవసరాలు నిలచిపోతాయి. విధి నిర్వహణలో అధికారుల అనుకూలత బాగుంటుంది. స్థానమార్పు లుండవచ్చును. విద్యా ప్రగతికి బాగా శ్రమపడాలి. సాంస్కృతిక, దైవ కార్యాక్రమాలలో పాల్గొంటారు. అనుకున్న పనులు నిదానంగా జరుగుతాయి.

## వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

తొందరపాటు నిర్ణయాలు తీసుకొనడం వల్ల సమస్యలు కలుగవచ్చును. ఆర్థిక పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. ఆశించే ఋణాలు, అధికారుల సహకారం ఆలస్యం కావచ్చును. కుటుంబ సభ్యులతో సమస్యలు ఏర్పడవచ్చు. కన్ను, నీరు, శిర స్సంబంధిత రుగ్మతలుంటాయి. బంధువియోగ వార్తలు వినడం, సన్నిహితుల వల్ల సమస్యలు కలగడం ఉంటుంది. వారాంతంలో అనుకోని ఖర్చులుంటాయి.

## ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

కుటుంబ వ్యవహారాలు, ఆస్తి వ్యవహారాల వల్ల ఇబ్బంది పడతారు. ఖర్చులు ఎక్కువగా ఉంటాయి. ఆదాయం సరిగా ఉండదు. కుటుంబ ముఖ్యులకు ఆరోగ్యం సరిగా లేకపోవచ్చును. అయితే అవసరాలకు డబ్బు సర్దుబాటు అవుతుంది. ఉద్యోగులు బాధ్యతల నిర్వహణలో గుర్తింపు, అధికారుల సహాయం పొందుతారు. ఆర్థికాభివృద్ధి అవకాశాలు లభించినట్లే ఉండి చేజారిపోతాయి.

## మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

వ్యాపార రంగంలో పోటీ వల్ల నష్ట పడతారు. వ్యవసాయ, వృత్తి రంగాలలో ఆదాయం తృప్తికరంగా ఉంటుంది. మనస్థిమితం సరిగా ఉండక నిర్ణయాలు సరిగా తీసుకొనలేరు. బిడ్డల విద్యాప్రగతి, కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. బంధువులతో విభేదాలు రావచ్చును. వ్యవహారాలలో న్యాయపరమైన చిక్కులు రాగలవు. అనుకున్న పనులు సరిగా జరుగవు. సాంస్కృతిక రంగాల వారికి బాగుంటుంది. ఆశ్చర్యకరమైన వార్తలు వారాంతంలో వింటారు.

## కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఆర్థిక స్థితి సంతృప్తికరంగా వుంటుంది. వ్యవసాయదారులకు తోట యజమానులకు ఇబ్బందులు రావచ్చును. కుటుంబ సభ్యులకు ఆరోగ్యం సరిగా లేకపోవచ్చును. ఉద్యోగులకు ఆదాయం, పనిభారం, అధికారుల అనుకూలత, స్థానమార్పు కలుగవచ్చును. శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చును. కొత్త వస్తువులు కొనడం, వస్తు, వాహన రిపేర్లుంటాయి.

## మీనం
(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆర్థికపరిస్థితి, ఆదాయం బాగున్నా అసంతృప్తి ఉంటుంది. బంధువులతో కొద్ది అభిప్రాయ భేదాలుంటాయి. ముఖ్యమైన పనులు అనుకూలంగా జరుగుతాయి. ఆర్థికంగా ఇతరులకు సహాయపడతారు. ఉద్యోగులకు పనిభారం పెరిగి అధికారుల అసంతృప్తిని చూడవలసి రావచ్చు. సాంస్కృతిక, రాజకీయ రంగాల వారికి గౌరవం, ప్రోద్బలం, విద్యా ప్రగతి బాగుంటుంది. ఆరోగ్యం వారం ప్రారంభంలో సరిగా ఉండదు. ఉద్యోగులకు స్థానమార్పు, డబ్బు పోగొట్టు కొనడం.

# జనవాణి

మూడవ పేజీ కొరవ

ప్రజాప్రభుత్వం అనిపించుకోదు!

గూడూరు వి.వి. ప్రభాకరరావు

## ఆర్యవైశ్య రజతోత్సవం ఏం సాధించింది?

జూన్ 25తేది నెల్లూరులో జరిగిన ఆర్యవైశ్య సంఘ రజతోత్సవ కార్యక్రమం ఎందుకు ఏర్పాటయ్యిందో అర్థం కావడం లేదు. ఈ సభలో చర్చనీయాంశాలు లేవు. పూల మాలలు, పొగడ్తలకే పరిమితమయ్యింది. గతంలో మునిసిపాలిటీలో కౌన్సిలర్లుగా ఏడు మంది ఆర్యవైశ్యులుండేవారు. ధర్మసంస్థలు అత్యధిక శాతం ఆర్యవైశ్యుల నిర్వహణలోనే వుండేవి. వర్గ వైషమ్యాల వల్ల అవి చేజారిపోయాయి. ప్రస్తుతం కౌన్సిలర్‌గా ఒక ఆర్యవైశ్యుడూ లేడు. ఈ సంఘం అధ్యక్ష కార్యదర్శులు ఈ పదవులను వేలంపాటలో పొంది, కార్యకలాపాలు లేకుండా నిర్వీర్యం చేశారు. చందాలిచ్చిన వారిని పొగిడే కార్యక్రమం మాని, భవిష్యత్తులో మంచి కార్యక్రమాలు ఈ సంఘం నాయకులు రూపొందించమని కోరుతున్నారు.

నెల్లూరు ఆర్. సత్యనారాయణరావు

## మతంకన్నా మానవత్వం గొప్పది

ప్రపంచం తిరోగమిస్తుందో, పురోగమిస్తుందో అర్థం కావడం లేదు. కంప్యూటరీకరణతో ముందుకు దూసుకు పోతున్న ప్రపంచంలో మత ఉద్రిక్తతలు ఈ మధ్య పెచ్చు పెరిగి పోతున్నాయి. రష్యాలో కమ్యూనిజం అంతరించిన పిదప అమెరికా ఏకైక అగ్రరాజ్యంగా చలామణి అవుతున్న ప్రస్తుత తరుణంలో ఈ ఉద్రిక్తతలు ఎక్కువయ్యాయి. కడకు రష్యా సైతం చెచెన్యాతో మత యుద్ధం చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. భారతదేశంలో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మత సంఘర్షణలు తగ్గిపోయాయి. బీజెపి రగిల్చిన చిచ్చు అయోధ్య వివాదంతో ముదిరి మతం రంగు పులుముకున్న గొడవలు ఎక్కువయ్యాయి. ఈ మధ్య క్రైస్తవ, ముస్లిం ప్రార్థనా మందిరాల్లో బాంబుపేలుళ్లు బాధను కల్గిస్తున్నాయి. మమతానురాగాలు దైవత్వాన్ని సాక్షాత్కరింపజేస్తాయని, వైరుధ్యాలు మానవ వినాశానికి దారితీస్తాయని అందరూ గ్రహిస్తే బాగుంటుంది.

నెల్లూరు వాస్తు రామచంద్ర

## రైల్వే సమస్యలు పరిష్కరించండి

నెల్లూరుటౌన్ తూర్పు నివాసిత ప్రజలు చాలా కాలంగా రైల్వే స్టేషన్‌లో కోరుకొంటున్న ఫుట్‌ఓవర్ బ్రిడ్జి బుకింగ్‌ను రైల్వేశాఖ ఏర్పాటు చేస్తున్నందుకు కృతజ్ఞతలు. రైల్వే పరంగా పరిష్కారానికి నోచుకోని ఎన్నో సమస్యలతో నెల్లూరీయులు సతమతమవుతున్నారు. గతంలో కన్నా నెల్లూరు టౌన్ బాగా పెరిగిపోయింది. దక్షిణ ప్రాంతంలో వున్న వేదాయపాళెం స్టేషన్‌లో అన్ని రైళ్లు ఒక నిమిషంపాటు ఆపితే ప్రజలకు ఎంతో మేలు జరుగుతుంది. కోరమండల్ ఎక్స్‌ప్రెస్‌ను నెల్లూరులో ఆపక పోవడం వల్ల, గూడూరు వెళ్లి ఎక్కాల్సి వస్తున్నది. తిరుపతి - ముంబాయిల మధ్య, విశాఖపట్నం - బెంగుళూరుల మధ్య కొత్త రైళ్లు వేసి అవి నెల్లూరులో ఆగే ఏర్పాటు చేస్తే నెల్లూరు ప్రయాణీకులు సంతోషిస్తారు. నవజీవన్ ఎక్స్‌ప్రెస్‌కు అదనపు బోగీ ఏర్పాటు చేస్తే ఏసీ త్రీ టైర్ యాత్రికులకు సౌలభ్యంగా వుంటుంది. ఈ విషయాన్ని రైల్వే మంత్రిత్వ శాఖాధికారులు పరిశీలించమని మనవి.

నెల్లూరు జెవిఆర్. బాబు

## టౌన్ ప్లానింగ్ శాఖను రద్దుచేయాలి

నెల్లూరు మునిసిపల్ టౌన్ ప్లానింగ్ శాఖ గుర్చి 'జమీన్‌రైతు'లో వున్నది వున్నట్లుగా వ్రాశారు. మునిసిపల్ పరిధిలో చట్టబద్ధంగా ప్లాన్లు పెట్టినా అధికారుల చేతులు తడపనిదే వాటిని అనుమతించరు. ప్లానుగీచే వారి నుండి ఈ అవినీతి మొదలవుతుంది. వారికే మామూళ్లు ముడుపు అందిస్తే ప్లాను వాటంతట అదే బయటకు వస్తుంది. అవినీతిలో నిలువునా మునిగిపోయి వున్న టౌన్ ప్లానింగ్ శాఖను రద్దు చేసి దాని బదులు ప్రత్యామ్నాయం ఆలోచిస్తే బాగుంటుంది.

నెల్లూరు టి.వి.నారాయణ

## సభా సమయం పెంచడం అవసరం

లోక్‌సభలో చర్చలు సజావుగా సాగేందుకు సభా సమయాన్ని పెంచే ప్రతిపాదన పరిశీలనలో ఉన్నట్లు స్పీకర్ బాలయోగి చెప్పారు. కాని సభలో సభ్యుల వ్యవహారసరళి పరిశీలించి చూసినప్పుడు సభా సమయాన్ని పెంచినంత మాత్రాన సమస్యలు తీరుతాయా అన్న అనుమానం కలగకమానదు. వున్న సమయాన్ని వివాదాలతో అనవసర చర్చలతో వృధా చేస్తున్నారు. ఎంతసేపు సభ సమావేశమైందన్న దానికన్నా అందులో నాణ్యత ఎంత అన్నది ముఖ్యం. సభా నిబంధనలు ఖచ్చితంగా పాటించనంతకాలం సభా కార్యక్రమాలు ప్రయోజనకరంగా సాగవు.

నెల్లూరు వి.సుధాకర్

## యాభైఏళ్ల క్రితం

మూడవ పేజీ కొరవ

కాంగ్రెస్, కమ్యూనిస్టు తత్వం (వెనుక)లో రెండు స్థానాలకు తీవ్ర పోటీ జరిగి, కాంగ్రెస్ వారులే గెలుపొందినారట. మొత్తం 14స్థానాలలో 8 కాంగ్రెస్ వారికి, 6 కమ్యూనిస్టులచే బలపర్చువారికి వచ్చినవి. ఇంతకూ ఇటీవలే జిల్లా బోర్డు కాంగ్రెస్ పార్టీలో చేరిన చంద్రశేఖరరెడ్డి ఎటువైపు పని చేశాడో మిత్రుడు సంజీవరెడ్డి చెప్పగలరా?

### రెండు ప్రశ్నలు

పెరోల్ మీద విడుదలై అండర్ గ్రౌండ్‌కు పోయిన గూడూరు సి.వి. సుబ్బయ్య విషయంలో అజాగ్రత్తకు బాధ్యులైన వారిపై ఏమి చర్య జరిపారు?

గత జనవరిలో లింగంటపాడులో అరెస్టు గావింపబడి, జామీను మీద విడుదల గాబడిన వారిలో ప్రముఖుడైన స్వర్ణ పెద్దయ్య పరారు చిత్తగించాడే, ఆ జామీను ఇచ్చిన వారిపై ఎట్టి చర్య జరిపారు. - విమర్శకుడు

### పల్లెటూళ్లు కోవూరు

స్కూళ్ల డిప్యూటీ ఇన్స్‌పెక్టరు వెంకయ్య గారు రిటైర్ అయ్యారు.

స్థానికనుంచి బదిలీ అవుతున్న యిన్నాళ్ల సాకు జెప్పి కొంపనూకబోవు

పాలు పెరుగు కొరకు ప్రాణాలు దీయవు

రాదె తమ్ము వాగడ రాళ్లపల్లి

- శివారెడ్డి

### అయ్యవారిపల్లె

మా గ్రామంలో ఆవు కడుపున ఏనుగు ఆకారం గల జంతువు పుట్టి వెంటనే మరణించింది. దానికి తొండము గూడా కలదు. ప్రజలు తండోప తండములుగా వచ్చి చూచిపోతున్నారు. - బి.వి.

### వాకిచర్ల

చక్కెర కోటా మా గ్రామానికివ్వి మూడు నెలలయ్యింది. కారణం మాకు తెలియదు. తాసిల్దారు వారు ఇది గమనించి, లోపమెక్కడుందో వెతికి మా నోరు గూడా కాస్త తీపిజేయగోరెదం. - గ్రామస్తుడు

### సినిమా వార్తలు

### పాకిస్థాన్ చిత్రాలు

పాకిస్థానుకంతా ఒక్క లాహోరులో మాత్రమే చిత్ర నిర్మాణం జరుగుతూ [illegible] ఏడు స్టూడియోలు వున్నాయి. ప్రసిద్ధ [illegible] నూర్జహాన్ ఆమె భర్త షౌకత్ హుసేన్ రిజ్వీతో కలసి నిర్మిస్తున్న ఛాన్వే పూర్తి కావచ్చింది. దీని దర్శకత్వం నూర్జహాన్ నిర్వహిస్తున్నది.

### సంగీతానికి మాత్రమే లక్షా 50వేలు

కె. అమర్‌నాథ్‌చే డైరక్టు చేయబడిన మెహర్బాని అనే చిత్రంలో సంగీతానికి మాత్రమే లక్షా 50వేల రూపాయలు ఖర్చు చేయబడినదట. దీనిలో బీగం పారా - అజిత్, గోప్, ఇందులాల్, యాకూబ్ నటించారు.

### జూపిటర్‌లో భానుమతి

## విడియో కాన్ఫరెన్స్

4వ పేజీ కొరవ

శివకుమార్, మల్లికార్జున్, ఎపిఎస్ కృష్ణప్రసాద్, కార్యదర్శి సురేంద్రరెడ్డి కోరారు. ఈ శిబిరం బరువు బాధ్యతలను ఎమ్మెల్యే వివేకానందరెడ్డి మోస్తారు.

## రవి ఆసుపత్రిలో సరికొత్త పరికరం

నెల్లూరులో రవి చిన్న పిల్లల ఆసుపత్రిలో పిల్లల వైద్య కోసం 'మారోపేక్ ఏ2300' అనే అధునాతన పరికరాన్ని అందుబాటులోనికి తెచ్చారు. పీడియాట్రిక్ డిజిటల్ ఎలక్ట్రోఎన్‌ఫెపలో గ్రామ్ అనే ఈ పరికరం చిన్న పిల్లల్లో మూర్ఛవ్యాధికి మూల కారణాన్ని సకాలంలో గుర్తించి, ఖచ్చితమైన వ్యాధి నిర్ధారణకు, చికిత్సా విధానానికి ఉపకరిస్తుంది. దేశంలో 10శాతం మంది చిన్న పిల్లలు మూర్ఛవ్యాధితో బాధపడుతున్నారని డాక్టర్ రవి చెబుతూ, ఈ చికిత్సకు మహానగరాల్లో ఖర్చు జాస్తని, తమ ఆసుపత్రిలో తక్కువ ఖర్చుతో ఈ చికిత్స చేస్తామన్నారు. పుట్టుకతో, మానసిక వికలాంగత్వం, ప్రమాదాలు, మెదడులో గాయాల వల్ల సంభవించే మూర్ఛవ్యాధి నిర్ధారణకు జిల్లా ప్రజలు మహా నగరాలకు పోవనవసరం లేదని తమ వద్ద మెరుగైన చికిత్స చేయించుకోవచ్చని డాక్టర్ ఖచ్చితంగా చెబుతున్నారు. ఈ పరికరాన్ని 2తేది మద్రాస్‌లోని కంచి కామకోటి చైల్డ్స్ ట్రస్ట్ హాస్పిటల్ డాక్టర్ పాండ్యన్ ప్రారంభించారు.

## సాయిచందన హాస్పిటల్ డే కేర్ సెంటర్

నెల్లూరు పొగతోటలోని సాయిచందన హాస్పిటల్ నేతృత్వంలో పుట్టుకతో వివిధ సమస్యలు కలిగివుండే బాల, బాలికల కోసం ప్రత్యేక పాఠశాల, వైద్య చికిత్సల నిమిత్తం ఒక 'డే కేర్' సెంటర్‌ను ప్రారంభిస్తున్నట్లు డాక్టర్ కె. అంజనీ కుమార్ చెప్పారు. 4తేది హాస్పిటల్‌లో విలేఖరులతో మాట్లాడుతూ పుట్టుకతో నడకరాని, మాటలురాని, బుద్ధిమాంద్యత, జ్ఞాపకశక్తి లేని పిల్లలకు ఉచితవైద్య శిబిరాన్ని 8తేది హాస్పిటల్‌లో ఏర్పాటు చేస్తున్నాం. శిబిరంలో చిన్నపిల్లల డాక్టర్లు, స్పీచ్‌థెరపిస్ట్, ఫిజియో థెరపిస్ట్, స్పెషల్ ఎడ్యుకేటర్స్, జర్మన్ థెరపిస్టు పాల్గొంటారు. ఈ రకమైన ప్రత్యేక పిల్లలలో దాగివున్న నిగూఢమైన శక్తిని వెలికి తీసేందుకు ప్రత్యేక శ్రద్ధ చూపిస్తారని డాక్టర్ తెలియజేశారు. అరుదైన ఈ అవకాశాన్ని ప్రజలు వినియోగించుకొంటే మంచిది.

## కళ్యాణ సుందరంకు ప్రమోషన్

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నెల్లూరు మెయిన్ బ్రాంచ్‌లో డిప్యూటీ మేనేజర్‌గా పనిచేసే ఎం. కళ్యాణ సుందరం పదోన్నతిపై వేదాయపాళెం ఎస్‌బిఐ మేనేజర్‌గా నియమితులయ్యారు. ఆయన స్థానంలో మెయిన్ బ్రాంచ్‌లో ఎన్.చంద్రశేఖర్ నియుక్తులయ్యారు.

## మహిళలకు అన్యాయం జరిగితే ఊరుకోం!

అన్ని రంగాల్లో మహిళలను అభివృద్ధి చేయడమే కాకుండా, మహిళలకున్న చట్టపరమైన హక్కుల పరిరక్షణకు జాతీయ మహిళా కమీషన్ ఏర్పాటయ్యిందని, జాతీయ మహిళా కమీషన్ సభ్యురాలు వి. శాంతారెడ్డి చెప్పారు. మహిళల ఆరోగ్య రక్షణ, బాల్య వివాహాల నిర్మూలన తదితర అంశాలపై జిల్లా పరిషత్ సమావేశపు హాలులో వివిధ శాఖాధికారులు, స్వచ్ఛంద సంస్థలు, మహిళా మండళ్ల సభ్యులతో 1తేది జరిగిన సమావేశంలో శాంతారెడ్డి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. మహిళల హక్కులకు భంగం కల్గించే విషయమేదైనా జాతీయ మహిళా కమీషన్‌కు ఫిర్యాదు చేస్తే న్యాయం జరిగేందుకు కమీషన్ బాధ్యత వహిస్తుందన్నారు. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో దేశం పురోగమిస్తున్న ప్రస్తుత తరుణంలో కొన్నిచోట్ల మాతమ్మల దురాచారం కొనసాగడం పట్ల ఆవేదనను వ్యక్తం చేశారు. ఈ విధానాన్ని రూపుమాపేందుకు పోలీసులు, రెవిన్యూ అధికారులు, స్వచ్ఛంద సంస్థల వాళ్లు కృషి చేయాలన్నారు. బాల్యవివాహాల రద్దుకు కూడా కృషి చేయాలన్నారు. ఏ రంగంలోనైనా ప్రతిభ చూపిన మహిళలకు జాతీయ స్థాయిలో అవార్డు లివ్వనున్నట్లు చెప్పారు. జిల్లా రెవిన్యూ అధికారి వి. వెంకటేశ్వర్లు ఎపిస్పీ రవికుమార్ మూర్తి తదితరులు ఈ సమావేశంలో పాల్గొన్నారు.

## పదవీ విరమణ

కోటమిట్టలోని విద్యుత్ శాఖ రెవిన్యూ కార్యాలయంలో ఎల్‌డిసిగా 30 సంవత్సరాల పాటు పనిచేసిన సూరం సుబ్రహ్మణ్యం జూన్ 30తేది పదవీ విరమణ చేశారు.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

నిరూపిస్తాడు.

ఇదంతా బాగానేవుంది. కాని సంఘ వ్యతిరేక శక్తులను పాతమార్చేందుకు ఇదివరకు ఎన్నో చిత్రాల్లో చూసి చూసి విసుగెత్తి పోయిన ఫైటింగులని విపరీతంగా ఈ చిత్రంలో వాడారు. అందువల్ల చిత్రం ముఖం మొత్తుతూవుంది. పాత ధోరణిని అధిగమించలేని ఇలాంటి దర్శకుడు "ఒక్కడు చాలు" చిత్రాల బాగును బుగ్గిపాలు చేసేందుకు.

రాజశేఖర్ ఆవేశంలో వాడి, ఆగ్రహంలో వేడి బలంగా చూపాడు. ఆ బలం విలన్లను చితక బాదేందుకు సరిపోయింది. రామిరెడ్డి, శరత్ సక్సేనా విలనీ మామూలు పంథాలోనే వుంది. సంఘవి, రంభలను హీరోయిన్లు అనేందుకు అవకాశమేలేదు, ఇద్దరూ నాట్యకత్తెల అవసరం తీర్చారు.

## సినిమా

9వ పేజీ కొరవ

అన్నది అంకెల్లో ఒకటయితే, ఆ తర్వాత శాఖలన్నీ ఆ సంఖ్య పక్కన చేరిన సున్నాల్లాంటివి. ఒకటి ఉండగా దాని పక్కన ఎన్ని సున్నాలు చేరినా దాని విలువ పెరుగుతూ ఉంటుంది. ఆ ఒకటే లేనప్పుడు ఎన్ని సున్నాలున్నా అవన్నీ కేవలం సున్నాలుగానే మిగులుతాయి తప్ప, వాటికి విలువ ఉండదు. మంచి కథలుంటే మంచి సంగీతం వస్తుంది. చేసే సంగీతం ఎఫెక్టివ్‌గా ఉంటుందని వివరించారు.

## బ్రాందీషాపులు

4వ పేజీ కొరవ

ప్రక్కనున్న షాపును బార్‌గా మార్చారు. రిక్షా కార్మికులంతా ఈ బార్‌లో ఎక్కువ కనిపిస్తుంటారు. దరిదాపులు టౌన్‌లో వున్న బ్రాందీ షాపులన్నీ తమకు అనుబంధంగా బార్‌లను నిర్వహిస్తున్నాయి. అనధికార బార్లతో పోలీస్, ఎక్సైజ్ అధికారులను కుబేరులను చేసే బదులు ప్రభుత్వమే లైసెన్సులిచ్చేస్తే, అర్థిక దారిద్ర్యమైనా కాసింత తీరుతుంది కదా!

గుంటూరు మసీదులో బాంబు ప్రేలుడుకు నిరసనగా అనంతసాగరంలో మౌన ప్రదర్శన చేస్తున్న ముస్లింలు.

## నేరపరిశోధన

4వ పేజీ కొరవ

పోలీసులు - జర్నలిస్టుల మధ్య సయోధ్యతో నేరాల అదుపుకు ప్రత్యేక కృషి చేస్తానన్నారు. బుచ్చి సర్కిల్‌లో జర్నలిస్టులపై పెచ్చు పెరిగిన పోలీసు వేధింపుల విషయమై పరిశీలిస్తానన్నారు. సమావేశంలో గుంటూరు రేంజ్ డిఐజి ఎం.మాలకొండయ్య, ఎస్పీ సి.వి. నరసయ్య కూడా పాల్గొన్నారు.

## పడిగాపులు

4వ పేజీ కొరవ

స్టోన్‌హౌస్‌పేటలోని మెయిన్ రోడ్డు అధ్వాన్నంగా తయారైవుంది. దీంతో ఈ రోడ్డున పయనించే వాహన చోదకులు అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. వ్యాపార కూడలి ప్రాంతమైన స్టోన్‌హౌస్‌పేటకు వివిధ వస్తువులు కొనుగోళ్లకు నిత్యం వేలాది మంది వస్తుంటారు. వివిధ సరుకుల అన్‌లోడింగ్, లోడింగ్ చేసేందుకు వందల సంఖ్యలో లారీలొస్తుంటాయి. పల్లిపాడు, నారాయణరెడ్డిపేట, అల్లీపురాలకు వెళ్తూ, వస్తూ ఈ మార్గంలోనే నిత్యం వందలాది బస్సులు ఇతర వాహనాలు తిరుగుతుంటాయి. ఎప్పుడూ వాహనాల వత్తిడి వుండే ఈ రోడ్డు ఆత్మకూరు బస్టాండు నుండి సర్వేపల్లి కాల్వ బ్రిడ్జి దాటగానే ఈ వారంలో కురిసిన చిన్నపాటి వర్షానికి గుంటలు పడిపోయి వుంది. పప్పులవీధి వెళ్లే మొదట్లో, కన్యకాపరమేశ్వరి దేవాలయం, బివిఎస్ గరల్స్ హైస్కూల్ వద్ద కూడా రోడ్డు బాగా దెబ్బతినింది. దీని వల్ల ఈ రోడ్డుపై ప్రయాణం దినదినగండం నూరేళ్ల ఆయుష్షుగా మారింది. అర్‌అండ్‌బి శాఖ నిద్ర మత్తువీడి ఈ రోడ్డు తక్షణ మరమ్మత్తులకై ప్రయత్నించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

## దానం

2వ పేజీ కొరవ

ధృఢంగా నిర్మించాడా కాంట్రాక్టరు. పూతపని కూడా చేయక పోవడంతో గోడలు సైతం నెమ్మెక్కిపోయి వున్నాయి. నేల మీద బురదలో పుస్తకాలు పెట్టుకొని చదువుకొంటున్న ఆ పిల్లలను చూస్తే మన బోటి వారికే కడుపుమండి పోతున్నది. ఇక అన్ని లక్షలు దానమిచ్చిన దాత మనసు ఎంత క్షోభిస్తుందో వూహించండి!

ఎంత అన్యాయం! మునిసిపల్ అధికార్లు అవినీతిపరులు అన్నది వింత వార్త కాదు కాని - నర పశువుల కంటే హీనమైన మనుష్యులని మాత్రం వూహించలేరు. ఎంతో ఉదార హృదయంతో, ఉదాత్త సంకల్పంతో ఒక వ్యక్తి చేయతలపెట్టిన మంచి పనిని ఇంత భ్రష్టుపట్టించడానికి వారు మనుషులా? పశువులా? ఎందరు పిలవకుండా కౌన్సిలర్లకు పనులివ్వడమే నేరం - పని చేయకుండా బిల్లు చెల్లించడం మహానేరం! కమీషనర్ గారు - ఈ పాపంలో మీకు భాగస్వామ్యం వుందో లేదో మాకు తెలియదు; కాని, దానికి వడిగట్టిన పాపాత్ములెవరో తేల్చి ఆ స్కూలు భవనాన్ని పూర్తి చేయించడం మీ బాధ్యత!*

# భక్త జనమనోల్లాసిని రామోపాసన సంచిక

తెలుగు సాహితీ ప్రాభవాలను దిగంతాలకు వ్యాపింపజేసిన నన్నయ్య నివాస స్థలం రాజమహేంద్రవరం. ఇక్కడ నుంచి భక్తి సాహిత్యాన్ని పుంఖాను పుంఖాలుగా వెలువరిస్తున్న శ్రీ పురాణంపండ రాధాకృష్ణ మూర్తి సాహిత్యార్చనలో 'శ్రీ రామోపాసన' ప్రత్యేక సంచిక ఒకటి. దాదాపు 292 పేజీల రచనలు, 20పేజీల రామాయణ గాథా సూచిత చిత్రాలు ఈ సంచికలో వున్నాయి.

ముఖచిత్రం బైండింగ్ అట్టమీద ఉత్తరాది సాంప్రదాయబద్ధమైన 'శ్రీరామ పట్టాభిషేకం' చిత్రం ఆకర్షణీయంగా వుంది. రచనలను ఏరికూర్చిన శ్రీ పురాణం పండ వాటిని ఒక క్రమపద్ధతిలో అమర్చ లేకపోవడం వల్ల పుస్తకం గజిబిజి అయింది.

అయితే దాశరథీ కరుణాపయోనిధీ మకుటంలో వున్న 'దాశరథి' శతకం, శ్రీరామ చంద్రాష్టకం, రఘోత్తమాష్టకమ్, రామస్తుతి వంటి శ్లోకాలు భక్తజన పఠనానికి ఉపయోగపడతాయి.

ఇవిగాక శ్రీరామచంద్ర డోంగరజీ మహారాజ్ రామాయణ నవమ పాల అనువాదం శ్రీమిండేశ్వర్ ప్రసాద్ సింహ హిందీ అనువాదం, వంటివి ఉత్తరాది రామసాహిత్యాన్ని తెలుసుకోవడానికి ఉపయోగపడతాయి. అచ్చయిన అనేక చిత్రాలలో పరిణతి లోపించిందన్న విషయం పరిశీలించిన వారెవరికైనా యిట్టే అర్థమై పోతుంది. ఇందులో చిత్రాలను పలువురు చిత్రకారులు గీసినట్లున్నారు. చిత్రకారులైన రమ్య, ప్రసాద్‌లు చిత్రాల విషయంలో జాగ్రత్త వహించి వాటికి సజీవత్వాన్ని, పరిణతిని సాధించ వలసి వుంది.

ఇందులోని శ్రీరామకర్ణామృతం శ్లోకాలను అభ్యాసాలుగా ప్రచురించారు.

శ్రీ రామచంద్రాజఘ్నయం సుదవరం
సీతామనోనాయకం
శ్యామాంగం శశికోటి పూర్ణవదనం
వందోత్కాల కౌస్తుభమ్
సౌమ్యం సత్వగుణోత్తమం, సునయమూతరే
వసంతం ప్రభుమ్
త్రాతారం సకలార్థ నిధినహితం
వందే రఘూణాంపతిమ్

పూజా సమయాలలో పఠనకు ఈ శ్లోకాలెంతయినా వుపయోగపడతాయి. ఇట్లాంటి శ్లోకాలను ఏర్చికూర్చి శ్రీ పురాణ పండ భక్తజనావళికి కొంత మేలు చేశారు. అందుకు వారిని అభినందించాలి. విస్తృత గ్రంథముద్రణ సంఖ్యను క్రమబద్ధీకరించుకొని ప్రణాళికలను రూపొందించినట్లయితే శ్రీ పురాణం పండ గ్రంథాలపై సమ్యక్ దృష్టిని నిలువగలుగుతారు.

శ్రీరామ రామరామేతి, రమేరామే
మనోరమే
సహస్రనామతత్తుల్యం
రామనామ వరాననే

| గ్రంథసమీక్ష |
| --- |
| రామోపాసన |
| సమీక్షకుడు |
| పాయసం సుబ్రహ్మణ్యం |
| ప్రతులకు: |
| పురాణపండ రాధాకృష్ణమూర్తి |
| రాజమండ్రి - 4 |

## జిల్లావార్తలు

12వ పేజీ కొరవ

కార్డులు నెలకు 40 రూపాయలిచ్చి బియ్యం, చక్కెర, గోధుమలు, కిరోసిన్, పామోలిన్ తన స్వంతం చేసుకొంటున్నాడు. ఈ సరకునంతా బ్లాక్ మార్కెట్‌కు తరలిస్తున్నాడు. తన వద్ద కార్డులు కుదవపెట్టని వారికి సరకు లివ్వక ఇబ్బంది పెడుతున్నట్లు గ్రామస్తులు చెబుతున్నారు. ప్రభుత్వం నిర్ణయించిన రేట్లకన్నా, అధికరేట్లకు సరకులను ఈ డీలర్ విక్రయిస్తాడని, తూకంలోనే చేతివాటం ప్రదర్శిస్తున్నాడని ప్రజలు ఆరోపిస్తున్నారు. ఎవరైనా ప్రశ్నిస్తే తనకు అధికారులు, రాజకీయ నాయకుల అండవుందని బెదరిస్తున్నాడట. గతంలో లెక్కలేనన్ని సార్లు సస్పెండ్ అయినా ఇతనికి మళ్లీ షాపు పెట్టుకొనేందుకు అనుమతినిస్తున్న అధికారుల నైజాలో అర్థం కావడం లేదు.

# కరవు బియ్యంలోనూ డీలర్ల కక్కుర్తి

పేదలకు చెందాల్సిన కరవు బియ్యం ఆత్మకూరు మిల్లర్లు చేజిక్కించుకొని లాభపడుతున్నారు. జిల్లాను కరవు ప్రాంతంగా ప్రభుత్వం ప్రకటించినందు వల్ల ప్రత్యేకంగా రేషన్ షాపుల్లో ఈ బియ్యం అమ్ముతున్నారు. ఈ బియ్యం క్వాలిటీ బాగుండడం వల్ల వీటిపై మిల్లర్ల చూపు బడింది. అనంతసాగరం మండలానికి సంబంధించిన డీలర్ల వద్ద నుంచి కేజీ బియ్యం 8 రూపాయలకు మిల్లర్లు కొంటున్నారు. ఈ బియ్యానికి పాలిష్ పట్టి బస్తాలు మార్చి, ప్రభుత్వానికి లెవీ బియ్యంగా తిరిగి అమ్ముతున్నారు. ఈ వ్యాపారం వల్ల ఎలాంటి శ్రమ లేకుండా మిల్లర్లకు కేజీకి 5 రూపాయలు మిగులుతున్నాయి. అనంతసాగరం నుంచి చీకటి పడ్డాక ఈ బియ్యం లారీలు రావడం, సరకు దించి వెళ్లిపోవడం గతకొన్ని రోజులుగా జరుగుతుంది. వారం రోజుల క్రితం బియ్యంతో వస్తున్న లారీని కొందరు యువకులు అటకాయించి పోలీసులకు తెలియజేస్తామని చెప్పి మిల్లర్ల వద్ద నుంచి 5వేల రూపాయలు నొక్కేసినట్లు తెలిసింది. ఈ వ్యవహారాన్ని అరికట్టేనాథుడు లేకపోవడం వల్ల కరవు బియ్యం అమ్ముకొనే ఏర్పాట్లలో ఆత్మకూరు, అనుమసముద్రంపేట డీలర్లు కూడా ఇక్కడి మిల్లర్లతో మంతనా[illegible] సాగిస్తున్నట్లు తెలుస్తుంది.

## పనిలేని బ్రాంచి పోస్టాఫీసులు

గ్రామీణ ప్రాంతాల్లోని బ్రాంచి పోస్టాఫీసులకు చేతినిండా పనిలేకుండా పోయింది. విపరీతంగా పెరిగిన ఇన్‌ల్యాండ్ కవర్లు, ఎన్వలోప్స్ ధరలు, మనియార్డర్ల కమీషన్ దీనికి కారణమని చెప్పొచ్చు. ఈ పోస్టాఫీసుల నుంచి మనియార్డర్లు, రిజిష్టర్లు బుక్ చేయడం తగ్గిపోయింది. డిపాజిట్లు అసలే లేకుండా పోయాయి. వచ్చే ఉత్తరాలు, మనియార్డర్లు తగ్గి పోవడంతో డెలివరీ ఏజంట్లకు జీతాలు తీసుకోవడం తప్ప మరో పనిలేదు. బ్రాంచి పోస్టుమాస్టర్, డెలివరీ ఏజంట్లకు ఒక్కొక్కరికి ఆఫీసులో 3వేలకు పైగా జీతాలు చెల్లిస్తున్నారు. రెవిన్యూ స్టాంపుల అమ్మకాలు తప్ప తతిమావి నామమాత్రం కావడంతో పోస్టాఫీసులు నష్టాలతో నడుస్తున్నాయి. కొందరు పొద్దుపోని ఇడి డిఎలు ఇతరుల జాబులు చదవడం, చించివేయడం లాంటి చిల్లర పనులు చేస్తున్నారని గ్రామస్తులు ఆరోపిస్తున్నారు. జాబు రాయడం కన్నా ఫోను చేయడమే చౌక అవడం వల్ల ఉత్తరాలు వ్రాసే వారి సంఖ్య కూడా తగ్గిపోతున్నట్లు బ్రాంచి పోస్టుమాస్టర్లు చెబుతున్నారు. ఈ వాదనలోనూ కాస్త నిజమున్నట్లుంది.

**మిల్లర్లకు లాభాల పంట**

## దరఖాస్తు చేయగానే వ్యవసాయ కనెక్షన్లు

ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రెస్కో) పరిధిలో రైతులు కనెక్షన్ కావాలని దరఖాస్తు పెట్టిన మరుసటి రోజే కనెక్షన్ ఇస్తామని ఛైర్మన్ పందిళ్లపల్లి సుబ్బారెడ్డి చెప్పారు. జమీన్‌రైతు విలేఖరితో 3వతేదీ ముచ్చటిస్తూ సంస్థకు ఇంత వరకు వినియోగదారులు 5కోట్ల రూపాయలు బకాయిలున్నట్లు చెప్పారు. సంస్థ పరిధిలో వ్యవసాయ కనెక్షన్లకు రైతులు 70శాతం సబ్సిడీ పొందుతున్నారు. సంస్థ మనుగడను దృష్టిలో వుంచుకొని బకాయిలను పది రోజుల్లో చెల్లించాలని లేకుంటే కనెక్షన్లు తొలగిస్తామన్నారు. రెస్కో ఆధ్వర్యంలో ఇటీవల 42 కాలనీలకు విద్యుత్ సౌకర్యం కల్పించినట్లు సుబ్బారెడ్డి వివరించారు.

## ఆత్మకూరు ఎమ్మార్వో బదలీ

ఆత్మకూరు మండల రెవిన్యూ అధికారి జి. వేణుగోపాల్‌ను బుచ్చిరెడ్డిపాళెంకు బదలీ చేశారు. ఈయన స్థానంలో ఎస్సీ కార్పొరేషన్ ఎ.ఓ. సి.హెచ్. రామ్మూర్తిని నియమించారు. ఎమ్మార్వోగా వేణుగోపాల్ నాలుగేళ్లు పని చేసి అందర్నీ మెప్పించడంతోపాటు, కుటుంబ నియంత్రణ పథకం అమలులో ఆత్మకూరును ఉన్నత స్థానంలో నిలిపారు.

## బడ్జెట్ పత్రాల ప్రింటింగ్‌కు 19వేలా!

గూడూరు మునిసిపాలిటీ 2000 - 2001 ఆర్థిక సంవత్సరానికి 4లక్షల 22వేల నాలుగు వందల రూపాయల మిగులు నిల్వతో బడ్జెట్‌ను ఆమోదించింది. 4వతేదీ మునిసిపల్

తొరువ 8వ పేజీలో

నెల్లూరులో మౌనపోరాటం చేస్తున్న సునీతమ్మను పరామర్శిస్తున్న ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి.

# కల్పలతపై కాంగ్రెస్ కసురు

గూడూరు మునిసిపల్ ఛైర్మన్ గోదూరు కల్పలతపై కాంగ్రెస్ కౌన్సిలర్లు విలేఖరుల సమావేశం ఏర్పాటుచేసి ధ్వజమెత్తారు. బదలీ అయిన కమీషనర్‌తో కుమ్మక్కై, బ్లీచింగ్ పౌడర్ కొనుగోలు వ్యవహారంలో కొన్ని వేల విలువ చేసే చెక్కులను మంజూరు చెయించినట్లు చెప్పారు. ఛైర్మన్‌కు ప్రజా సమస్యలే పట్టడం లేదని టౌన్‌లోని నారాయణమ్మ వీధి, మిట్ట పాళెం, జాంద్రవీధి తూర్పు వీధుల్లోని కొళాయిల్లో నీళ్లు రాకపోయినా ఆమె పట్టించుకోవడం లేదన్నారు. విఘ్నేశ్వరపురం వద్ద బావికి మోటారు బిగించినా ఛైర్మన్ నీరు వదలడానికి ఒప్పుకోవడం లేదన్నారు. ప్రజాప్రతినిధుల విన్నపాలను ఛైర్మన్ అసలు పట్టించుకోవడం లేదన్నారు. సమావేశంలో ఎల్లసిరి గోపాలరెడ్డి, దండు మహేశ్వరరెడ్డి, ఎన్. నాగులు, సి.హెచ్. రమణయ్య, సిహెచ్. శ్యామ్‌ప్రసాద్, ఎస్వీ సుబ్బమ్మ, జి. సరస్వతి, కాంగ్రెస్ పట్టణాధ్యక్షుడు ఎస్వీ శ్రీధర్ పాల్గొన్నారు.

**జిల్లావార్తలు**

## రేషన్ కార్డులు కుదవ పెట్టుకొంటున్న డీలర్

అనంతసాగరం మండలం కొత్తపల్లి డీలర్ రేషన్ కార్డులు కుదువ పెట్టుకొంటున్నారు.

తొరువ 11వ పేజీలో

గుంటలమయమైన గూడూరు రోడ్లపై ఆర్టీసీ బస్సు పాట్లు.

# గూడూరు రోడ్లు గబ్బు, గబ్బు

నాలుగు రోజులుగా కురుస్తున్న చిన్నపాటి వర్షానికి గూడూరు రోడ్లు గబ్బు గబ్బుగా మారాయి. రోడ్డు అనేది మాయమై, ఏ గుంట ఎంత లోతుందో తెలియక పాదచారులు పడరానిపాట్లు పడుతున్నారు. ముత్యాలపేట నుంచి హాస్పిటల్ వరకు సాగేరోడ్డు, కూరగాయల మార్కెట్ రోడ్డును నిత్యం శుభ్రపరచక పోవడం వల్ల కాలుపెడితే మోకాలు లోతు బురదలో కూరుక పోతుంది. మునిసిపల్ పాతబస్టాండ్ నుండి టవర్ క్లాక్ వరకు రోడ్డు గుంటలు గుంటలుగా వుండడం వల్ల బస్సులు వీటిల్లో పడి లేస్తున్నాయి. ఈ రోడ్డుకు మరమ్మత్తులు చేసినట్లు గతంలో రెండుసార్లు మునిసిపాలిటీలో బిల్లులు చేసుకొని తినేశారే కాని దీని అతిగతి పట్టించుకోలేదు. గలీజుగా తయారైన ఈ రోడ్లపైనే బురద వెదజల్లి పోతున్న వాహనాల చోదకులను శాపనార్థాలు పెడుతూ ప్రజలు బస్సులకై వేచిచూస్తున్నారు. శుభ్రమైన రోడ్లు గూడూరు ప్రజలకు ఎప్పుడు అందుబాటులోనికి వస్తాయో?

**పట్టించుకొనే వారేరి ?**

## వెంకటగిరిలో పోటా పోటీ పర్యటనలు

వెంకటగిరి నియోజక వర్గ పరిధిలోని పలు గ్రామాల్లో ఎమ్మెల్యే రాజ్యలక్ష్మమ్మ తెలుగుదేశం కన్వీనర్ సినీనటి శారద ఈ నెల మొదటివారంలో పర్యటించారు. రాజ్యలక్ష్మమ్మ ఓజిలిలో కరెంటు ధర్ల పెంపునకు నిరసనగా ధర్నా నిర్వహించి అరెస్ట్ అయ్యారు. బాలాయపల్లిలో పోలీసు గృహ సముదాయాన్ని వెంగమాంబ పురంలోని హైస్కూలు గదులను ప్రారంభించారు. బాలాయపల్లిలో అధికారుల సమీక్షా సమావేశం నిర్వహించి వారి పనితీరుపై ధ్వజమెత్తారు.

తొరువ 8వ పేజీలో

# ఇంజనీర్లకు లంచాలు - రైతులకు కష్టాలు

ప్రభుత్వ ధనాన్ని రక్షించాల్సిన ఇరిగేషన్ అధికారులు, కాంట్రాక్టర్లతో లాలూచీ పడడంతో పొట్టమీద వున్న పైర్లు దెబ్బతింటున్న సంఘటన సంగం మండలం అన్నారెడ్డిపాళెంలో జరుగుతూంది. అన్నారెడ్డిపాళెం పరిధిలోగల దాడవ కాలువ రిపేర్ల కోసం నీటి వినియోగదారుల సంఘం నిధుల నుంచి 2.25లక్షలు ఆరు నెలల క్రితం విడుదలయ్యాయి. అప్పట్లో ఆ పనులు ప్రారంభం కావాల్సి వుండగా పైర్లు నడి పొట్టదశలో ఉండడంతో రైతుల విజ్ఞాపనతో జిల్లా కలెక్టర్ వీటిని ఆపివేయడం జరిగింది. ప్రస్తుతం ఈ పనులను చేపట్టిన కాంట్రాక్టర్, ఇంజనీరింగ్ అధికారులతో కుమ్మక్కై, ఈ పనులను నాసిరకంగా చేయిస్తున్నారు. మామూలుగా ఈ పనులను ప్రొక్లయిన్స్‌తో చేయించాల్సి వుండగా కొద్ది మంది పనివాళ్లతో చేయిస్తున్నారు. ఈ తతంగానికి ఇరిగేషన్ అధికారులు కాపలా కాస్తున్నారు. ఈ పనులను చేయాల్సిన సమయంలో చేయకుండా ఆలస్యంగా చేయడంతో పొట్టదశలో వున్న 50ఎకరాల పంటకు నష్టం జరుగుతుందని రైతులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఈ పనులను చేస్తున్న కాంట్రాక్టర్ తన పొలం దగ్గర మాత్రం ప్రొక్లయిన్‌తో శుభ్రంగా చేయించుకొని మిగతా రైతుల పొలాల వద్ద కూలీలతో నామమాత్రంగా చేయడం వెనుక భారీగా ఇంజనీరింగ్ అధికారులు లంచాలు వాటాగా ఇద్దారని తెలుస్తుంది. 2.25లక్షలు విలువ చేసే ఈ పనిని 50వేలతో సరిపెట్టి మిగతా నిధులను ఇరిగేషన్ అధికారులు, కాంట్రాక్టర్లు తమ వాటాలుగా పంచుకొను రంగం సిద్ధం చేసుకొన్నట్లు తెలిసింది. అవినీతికి దొంగ బిలులు చేసే అధికారులను ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి ఎందుకు సమర్థిస్తున్నారో అర్థం కావడం లేదు. జిల్లా కలెక్టర్ ఈ వ్యవహారమై స్పందించి తగు విచారణ చేయిస్తే నిజానిజాలు వెలికివస్తాయి.

**అన్నారెడ్డిపాళెం చాడవ కాలువ అవినీతి**

## వెంకటగిరి హౌస్ బిల్డింగ్ సొసైటీ

వెంకటగిరి హౌస్ బిల్డింగ్ సొసైటీ కొత్త అధ్యక్షునిగా నత్యగారి విజయసారథి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఉపాధ్యక్షులుగా వి. చిరంజీవి; కార్యదర్శిగా జి.కోటేశ్వరరావు; డైరక్టర్లుగా పి. దామోదరం, ఎ. వెంకటరెడ్డి, ఎం. సుబ్బరామయ్య, ఇ. గురునాధంలు ఎన్నికయ్యారు. ఎన్నికలను సహకార శాఖ సబ్‌రిజిష్ట్రార్ శివప్రసాద్ పర్యవేక్షించారు.

## రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం

రాష్ట్ర ఉపాధ్యాయ సంఘం, ఆంధ్రప్రదేశ్ శాఖ చిల్లకూరు మండల సర్వసభ్య సమావేశం జూన్ 30తేదీ చిల్లకూరులో జరిగింది. ఈ సందర్భంగా మండలశాఖ ఎన్నికలు జరిగాయి. అధ్యక్షునిగా కె. కృపానందం; అసోసియేట్ అధ్యక్షునిగా ఎం.ఎల్. సుధీర్‌రెడ్డి; ప్రధాన కార్యదర్శిగా కె. వీరాస్వామి; ఉపాధ్యక్షులుగా పి.వి. కృష్ణారెడ్డి, వి. సుధాకర్, మహిళా కార్యదర్శులుగా వి.ఎల్. నారాయణమ్మ, కుమారి శోభమ్మలను ఎన్నుకొన్నారు.

నెల్లూరులోని రవి చిన్నపిల్లల ఆసుపత్రిలో పెట్టిన అధునాతన పరికరంతో మూర్ఛ వ్యాధిగల బాలుని పరీక్షిస్తున్న డాక్టర్లు.